Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism
# జమీన్‌రైతు
సంపుటి: 83 • సంచిక: 18 • 3-5-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# కండ్లేరుకు కన్నం పెడుతున్న ముఖ్యమంత్రి!

## తన వేలితో తన కన్నే పొడిచినట్లున్నా ఈ పథకానికి ఆర్థికమంత్రి హోదాలో అనుమతి ఇవ్వడానికి ఆనం రామనారాయణరెడ్డికి సిగ్గేయలేదా?

పేరు గొప్ప వూరు దిబ్బ అనే సామెత నెల్లూరు జిల్లాకు అతికినట్లు సరిపోతుంది. బయట ప్రపంచంలో నెల్లూరు అంటే జనానికి అసూయ. హైదరాబాదులో ఏ హోటల్ చూసినా నెల్లూరు రెడ్లదే. మద్రాసులో పెద్ద పెద్ద వ్యాపారాలన్నీ నెల్లూరు వాసులవే. బెంగుళూరులో కట్టే ప్రతి రియల్ ఎస్టేట్ భవంతి వెనుకా నెల్లూరీయుల ప్రమేయం ఏదో ఒక రూపంలో వుంటుంది. ఒక దశలో పార్లమెంట్‌లో పది మంది నెల్లూరీయులు ఎమ్పీలుగా వున్నారు. ఇప్పుడు కూడా వారి సంఖ్య ఎనిమిది. గత నలభై ఏళ్లుగా రాష్ట్ర రాజకీయాలలో నెల్లూరు నేతలది కీలక స్థానం. ఏసి సుబ్బారెడ్డి, నేదురుమల్లి జనార్ధనరెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి త్రయం పదవిలో వున్నా లేకపోయినా రాష్ట్ర రాజకీయం తమ కనుసన్నలలో మసలేటట్లు చేసుకొన్నారు.

అంగట్లో అన్నీ వున్నాయి. కానీ అల్లుడి నోట్లో శని వుంది. నెల్లూరుకు రాజకీయంగా, ఆర్థికంగా ఇంత శక్తి సంపత్తులు వున్నప్పటికీ, జిల్లా అభివృద్ధి, సమస్యల పరిష్కారం, సంపద వినియోగం, కనీస పాటి హక్కుల విషయంలో తీరని అన్యాయం జరుగుతున్నది. ఏ ప్రభుత్వం మారినా ఇదే పరిస్థితి. అందరి కళ్లూ నెల్లూరు మీదనే. ఏది దొరుకుతుందా దోచుకొని పోదామన్నట్లు కాచుకొని వుంటున్నారు నేతలు. ఇందుకు ఎన్నో ఉదాహరణలు. తాజాగా కండ్లేరు నీటికి కన్నం వేస్తున్నాడు ఇప్పటి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి.

ఆయన చిత్తూరు జిల్లా వాసి. తన ముఖ్యమంత్రిత్వం తన జిల్లాలో శాశ్వతంగా గుర్తుండిపోవాలనే తపన. ముఖ్యమంత్రి అనే వాడు రాష్ట్రం మొత్తం ప్రయోజనాలు చూడాలి. అన్ని జిల్లాలనూ సమదృష్టితో పర్యవేక్షించాలి. కానీ అటువంటి విశాల హృదయులు ఇప్పుడు కాగడా వేసి వెతికినా కన్పించరు. కిరణ్‌కుమార్‌రెడ్డి కీర్తి కండూతికి నెల్లూరుజిల్లా నష్టపోబోతున్నది. కండ్లేరు నుంచి ఆరు టిఎంసీల నీళ్ల తరలించి, చిత్తూరు నగరానికి త్రాగునీరు, తన నియోజకవర్గ భూములకు సాగు నీరు ఇవ్వాలని తలపోస్తున్నాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. అందుకోసం రెండు దశలలో 7390 కోట్ల రూపాయల పథకానికి శ్రీకారం చుట్టాడు. సర్వే పనులు మొదలు పెట్టాడు. రేపో మాపో టెండర్లు పిలిచి, కాంట్రాక్ట్ కూడా ఇచ్చి వేసేట్లున్నాడు.

దారుణమైన అన్యాయం ఇది. కండ్లేరు జీవ నది కాదు. ఇరవై ఏళ్లకు ఒకసారి కూడా అందులో వరద వుండదు. వున్నా అతి కొంచెం. మద్రాసుకు ఒప్పందం ప్రకారం ఇవ్వాల్సిన కృష్ణా జలాల నిల్వ కోసం కట్టిన రిజర్వాయర్ అది. లెక్క ప్రకారం, కృష్ణ నుంచి సోమశిలకు నీరు మళ్లించి, అక్కడ నుంచి కండ్లేరు నింపి, మద్రాసుకు నీరివ్వాలి. ఆ రిజర్వాయర్ నిర్మాణం పూర్తయ్యి 17 సంవత్సరాలైంది. కానీ కేవలం ఆరంటే ఆరు సార్లు మాత్రమే కృష్ణ నీళ్ల కండ్లేరుకు చేరాయి. ఒకటి రెండు సంవత్సరాలు తప్ప తతిమా అంతా మద్రాసుకు నీరు పారుతూనే వుంది. నెల్లూరు రైతుల నోరు నొక్కి మద్రాసుకు దాహార్తి తీరుస్తున్నారు. చంద్రబాబు వున్నప్పుడు తిరుపతి నగరానికి ఇక్కడ నుంచే త్రాగునీరిచ్చాడు. ఇప్పుడు కిరణ్‌కుమార్‌రెడ్డి చిత్తూరు కోసం కండ్లేరును ఊడ్చుకొని పోజూస్తున్నాడు.

కండ్లేరు క్రింద నెల్లూరు జిల్లాలో రెండు లక్షల యాభై వేల ఎకరాలకు సాగునీరు హక్కు వుంది. అది మన రైపేరియన్ రైట్. ఈ భూమి సమస్తం, వెంకటగిరి, రాపూరు, గూడూరు మెట్ట ప్రాంతాలకు చెందినది మాత్రమే. కండ్లేరు నీరు పారకుంటే ఈ భూములు ఎండిపోతాయి. లెక్క ప్రకారం రెండున్నర లక్షల ఎకరాలకు 25 టిఎంసీల నీరు అవసరం. కానీ ఈ పదిహేనేళ్లలో కేవలం ఒక్క సంవత్సరం మాత్రమే కృష్ణ నుంచి 24 టిఎంసీల నీళ్లు వచ్చాయి. అంటే పేరుకు కృష్ణ జలాలతో సోమశిల క్రింద నెల్లూరు సాగు నీటి అవసరాలు తీర్చాలన్న ఒప్పందం తప్ప వాస్తవంలో అది అమలు జరగడం లేదని అర్థం. ఈ నేపథ్యంలో కండ్లేరు నుంచి ఆరు టిఎంసీల నీళ్ల చిత్తూరు జిల్లాకు తరలించుక పోవడం అంటే నెల్లూరు జిల్లా రైతాంగం నోరు కొట్టడం క్రిందే లెక్క. చిత్తూరు తరలింపుకు పైప్ లైన్ వేస్తారట. అది రిజర్వాయర్ అడుగు భాగం నుంచి వెళ్తున్నది. అంటే వచ్చిన నీరు వచ్చినట్లే వెళ్లి పోతాయన్న మాట.

ఏమిటీ అన్యాయం? నెల్లూరుజిల్లా రాజకీయ నాయకత్వం ఇంతగా గొడ్డు పోయిందా? మరీ కడుపు మండే విషయం ఏమిటంటే, ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఈ నీటి చోరీకి అనుమతి మంజూరు చేయడం. నెల్లూరు రైతుల కడుపు కొట్టి మద్రాసుకు నీరు తరలించడానికి లేదని ఆమరణ నిరాహార దీక్ష చేసిన పెద్ద మనిషి ఆయన. ఇప్పుడు తన చేతులతోనే కండ్లేరు రైతుల మెడకు ఉచ్చు బిగించే పాపానికి ఎట్లా ఒడికట్టాడో అర్థం కావడం లేదు.

చిత్తూరు జిల్లాకు నీరు పారిస్తే అభ్యంతర పెట్టవలసింది ఏదీ లేదు. కానీ అది మన కడుపు కొట్టే

కొరవ 14వ పేజీలో

## రక్షణ రంగంలో నెల్లూరీయుడి ఉన్నతి!



నెల్లూరుజిల్లా మహిమలూరుకు చెందిన యువ శాస్త్రవేత్త సతీష్‌రెడ్డి రక్షణ రంగంలో అత్యంత ప్రతిష్టాత్మకమైన ఇమారత్ డైరెక్టర్‌గా ప్రమోషన్ పొందాడు. దేశ రక్షణ పరికరాల పరిశోధన బాధ్యత నిర్వహించే డిఆర్‌డిఓ అనుబంధ సంస్థ ఇది. ఈ సంస్థకు ప్రథమ డైరెక్టర్ డాక్టర్ అబ్దుల్ కలాం కావడం ఇక్కడ గమనించవలసిన అంశం. దాన్నిబట్టే ఈ సంస్థ ప్రాధాన్యత ఏమిటో అర్థం చేసుకోవచ్చు. సతీష్‌రెడ్డి ఇదే సంస్థలో 1986 నుంచి పని చేస్తున్నాడు. జూనియర్ శాస్త్రవేత్తగా ఉద్యోగం ఆరంభించి, ఈరోజు ఈ ఉన్నత స్థానం చేరుకొన్నాడు.

సతీష్‌రెడ్డి సాధారణ రైతు కుటుంబీకుడు. ఆయన ప్రాథమిక విద్య కూడా అంతే సాధారణంగా నడిచింది. మహిమలూరు జిల్లాపరిషత్ స్కూల్‌లో పదవ తరగతి వరకు చదివాడు. ఇంటర్మీడియేట్ విఆర్ కాలేజి. ఇంజనీరింగ్ జెఎన్‌టియూ అనంతపురంలో చేశాడు. ఆ తర్వాత హైదరాబాదులో ఎంఎస్ చేశాడు. సగటు కుటుంబ నేపథ్యంలో, అత్యంత సాధారణ పాఠశాల చదువుతో ఇంత ఉన్నత స్థానానికి ఎదగడంలోనే సతీష్‌రెడ్డి అసాధారణ ప్రజ్ఞ వ్యక్తమౌతున్నది. సతీష్‌రెడ్డిని చూసినవారు అంత గొప్ప స్థాయికి చేరుకొన్నాడంటే నమ్మలేరు. అంత నిరాడంబరంగా, నిశ్శబ్దంగా వుంటారాయన. దైవ భక్తి కూడా జాస్తి. ఆయన మరిన్ని కీర్తి శిఖరాలు అధిరోహించాలని మనసారా ఆకాంక్షిస్తున్నాము.

## జగన్‌కు బెయిల్ ఆశలు

వైఎస్ జగన్ బెయిల్ కేసు సుప్రీంకోర్టులో విచారణకు వచ్చింది. రెండు వారాల క్రితం వరకు జగన్‌లో బెయిల్ దరఖాస్తు చేసే ధైర్యం కూడా లేదు. చాలా తటపటాయించాడు. సిబిఐ ఏదో ఒక నెపంతో దాన్ని తిరస్కరింప చేయడమే కాక, సమీప కాలంలో మరొకసారి దరఖాస్తు చేసే అవకాశం కూడా లేకుండా చేస్తారేమో అని భయపడ్డాడు. కానీ ఇప్పుడు పరిస్థితి మారింది. బొగ్గు కుంభకోణం కేసులో సిబిఐ పాత్ర వివాదాస్పదం కావడం ఆయనలో ఆశ చిగురించడానికి కారణం. ఇప్పటివరకు సిబిఐ మాట అన్ని కోర్టులకూ వేదవాక్కుగా వుండేది. కానీ సిబిఐ డైరెక్టర్ చేతిలోని నివేదికను న్యాయశాఖ మంత్రి, ప్రధానమంత్రి కార్యాలయం అధికారులు తమ చేతిలోకి తీసుకొన్నారన్న వార్త ఆ సంస్థ పరువును బజారుకు నెట్టింది. ఈ నేపథ్యంలో సిబిఐ వాదనను సుప్రీం కోర్టు పెద్దగా పట్టించుకోక పోవచ్చునని, జగన్‌కు బెయిల్ ఇవ్వవచ్చునని ఒక అంచనా వేస్తున్నారు వైఎస్ కాంగ్రెస్‌వాదులు.

# చైనా కవ్వింపు

చైనా సైనికులు భారత సరిహద్దులు దాటి 19 కిలోమీటర్లు ముందుకు చొచ్చుకు వచ్చారు. గుడారాలు వేసుకొన్నారు. కుక్కలను వెంటబెట్టుకొని తిరుగుతున్నారు. చైనా భూభాగం నుంచి వారికి ఆహారం సరఫరా అవుతున్నది. అందుకోసం మన భూభాగంలో ఒక రోడ్డు నిర్మిస్తున్నారు. వెనక్కు పొమ్మంటే పోవడం లేదు. మన విదేశాంగ మంత్రి చైనా రాయబారిని పిలిచి మాట్లాడాడు. ఆ వెంటనే చైనా సైనికులు అదనంగా మరొక గుడారం వేసి, మీ మాట వినబోమనే సంకేతం ఇచ్చారు. ఈ సమస్యను ఎట్లా పరిష్కరించాలో అర్థం కాక జుట్టు పీక్కొంటున్నాడు మన ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్. చైనా ప్రధాని మాత్రం ఇదేమంత పెద్ద సంఘటన కాదన్నట్లు, రేపు 20తేది మన దేశ పర్యటనకు రాబోతున్నాడు.

చైనా కబ్జా చేసిన భారత భూభాగం తూర్పు లడక్ ప్రాంతంలో వుంది. చైనా, భారత్, పాకిస్తాన్ సరిహద్దులు కలిసే త్రిభుజ కోణానికి సమీపంలో వుంది ఇది. అదంతా మంచు ఎడారి. 16500 అడుగుల ఎత్తున, మనుషుల నివాసానికి ఎంత మాత్రం పనికి రాని స్థలం. నర సంచారమే వుండదక్కడ. సరిహద్దు భద్రతకు వ్యూహాత్మకమైన కారాకోరం రహదారికి సమీపంలో వుండడం ఒక్కటే ఈ కబ్జాకు ప్రాధాన్యత. ఈ ప్రాంతంలో చొరబాటు వల్ల చైనాకు వచ్చే లాభం అంటూ ఏదీ లేదు.

అయినా ఎందుకు కవ్వింపుకు పూనుకొంటున్నారనేది ప్రశ్న. అందులోనూ భారత దేశంతో చైనాకు విస్తృత వ్యాపార అవసరాలు వున్నాయి. గత ఏడాది వారు మన దేశానికి చేసిన ఎగుమతుల విలువ దాదాపు మూడు లక్షల కోట్ల రూపాయలు. మన నుంచి వారికి జరిగిన ఎగుమతులు కేవలం 70వేల కోట్ల రూపాయలు మాత్రమే. ఇంత భారీ పరిణామంలో వారి వస్తువులు మనకు అమ్ముకోవాలనుకొన్నప్పుడు, మనతో సంబంధాలు చెడగొట్టుకోవడం ఎంత మాత్రం మంచిది కాదు.

పోనీ యుద్ధం కోసం తహతహ లాడుతున్నారా అంటే, ఎంత మాత్రం కాదు. యుద్ధం చేసే స్థితిలో రెండు దేశాలూ లేవు. దానివల్ల వినాశనం తప్ప ప్రయోజనం ఎవరికీ లేదు. రెండూ అణ్వాయుధాలు కల్గిన దేశాలు. ఇద్దరి దగ్గరా విధ్వంసకర క్షిపణులున్నాయి. వారు మన కంటే శక్తిమంతులు కావచ్చు. కానీ నష్టం ఇద్దరి పక్కా వుంటుంది గెలుపు ఇద్దరిలో ఎవరికీ దక్కదు.

చైనా ఉద్దేశం ఎవరికీ అర్థం కావడం లేదు. ఇప్పటికే అరుణాచల్‌ప్రదేశ్‌లో సరిహద్దు పేచీ పెట్టుకొని వుంది ఆ దేశం. అరుణాచల్ ప్రదేశ్ తమకు కావాలని హఠం పడుతున్నది. ఇప్పుడు కొత్తగా లడక్ మీద కన్నేసింది. మనుష్య సంచారం లేని, మొక్క కూడా మొలవని మంచు ఎడారిని ఎంత స్వాధీనం చేసుకొన్నా వారు పొందే ప్రయోజనం శూన్యం. అయితే చైనా సైనికులు మన భూభాగంలోకి చొచ్చుక వస్తుంటే మన సైనికులు ఏమి చేస్తున్నారన్నది ప్రశ్న. గతంలో పాకిస్తాన్ సైనికులు కార్గిల్ కొండల మీద తిష్ట వేస్తున్నప్పుడూ మన సైన్యం ముందు జాగ్రత్త పడలేకపోయింది. దాని ఫలితం చిన్నపాటి యుద్ధం. ఇప్పుడు చైనాతో యుద్ధం జరగకపోవచ్చు. అయితే, మన సైనికులను చచ్చు దద్దమ్మలుగా ఎంచి, కవ్వింపు చర్యకు పాల్పడుతుంటే ఏమీ చేయలేక పోతున్నామనే ఆత్మ నూన్యతా భావం మాత్రం మొత్తం జాతిని వేధిస్తున్నది. కేంద్ర ప్రభుత్వ మెతకతనం వల్లనే ఈ దుర్గతి అనేది నిర్వివాదాంశం. మన ప్రధానికి గుమస్తా లెక్కలు తప్ప దేశ గౌరవం మీద అవగాహన లేదు. అవసరం వచ్చినప్పుడు కఠినంగా వ్యవహరించే ఆత్మస్థైర్యం లేదు. కుక్క కాటుకు చెప్పుదెబ్బ అన్న తీరులో ప్రభుత్వం వ్యవహరిస్తే పొరుగు దేశాలు ఒళ్లు దగ్గర పెట్టుకొని వుంటాయి. సర్కారు తీరు బుద్ధావతారం అనే హేళన ప్రాయపు భావన బలపడితే ఇటువంటి అవమానాలు సృష్టించి వినోదిస్తాయి పొరుగు దేశాలు. చైనా దురాక్రమణ ఉద్దేశం కూడా ఆ వెటకారంగా మాత్రమే కన్పడుతున్నది.

ఆర్థిక సంస్కరణల కంటే ఆత్మగౌరవం ముఖ్యం అన్న జ్ఞానోదయం మన ప్రధానిలో కలిగితే తప్ప ఈ చిల్లర జగడాలు పరిష్కారం కావు. దురాక్రమణ జరిగి మూడు వారాలు గడుస్తున్నా చైనాకు కఠినమైన మందలింపు కూడా చేయలేక పోతున్నారంటే మనది ఎంత చేతకాని ప్రభుత్వమో అర్థం చేసుకోవచ్చు.

జమీన్‌రైతు

# జనవాణి

## దయల్ 100 మంచి పథకం!

రాష్ట్ర ప్రభుత్వం ఉగాది నుంచి లాంఛనంగా ప్రారంభించిన డయల్ 100 పథకం పేద, మధ్యతరగతి ప్రజలకు ఎంతగానో ఉపయోగపడే పథకంగా చెప్పొచ్చు. బాధితులు తమ అవసరాల కోసం పోలీస్‌స్టేషన్‌కు పోవాలంటే వ్యయ ప్రయాసలకులోను కావాలి. అక్కడకు వెళ్లినా సరైన సమాధానం దొరకదు. రైటరు లేడనో, ఎస్ఐ రాలేదనో గంటల తరబడి వేచి ఉండాలి. మహిళలు స్టేషన్‌కు పోలేక ఇబ్బందులు పడుతున్నారు. సమాజంలో నేరాలు పెచ్చు పెరిగిపోతున్న ప్రస్తుత తరుణంలో ఈ పథకాన్ని రూపుదిద్దిన డిజిపి దినేష్‌రెడ్డికి ధన్యవాదాలు.

*గడ్డం తిరిపాలు రెడ్డి* — మహమ్మదాపురం

## జగన్‌ను తిడితే జనం హర్షించరు!

రాష్ట్రం సర్వతోముఖాభివృద్ధికి అనునిత్యం తపించి పేదవాడి సంక్షేమమే ధ్యేయంగా పాలన సాగించి పేదవారి సేవలోనే తనువు చాలించిన మహానేత డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి. తెలుగువారి ఆత్మగౌరవం కోసం ఢిల్లీ పెత్తనాన్ని వ్యతిరేకించి కాంగ్రెస్ అధిష్టానాన్ని ధిక్కరించిన ప్రజానాయకుడు వైఎస్ జగన్. సాధారణంగా ప్రతిపక్షాలు అధికారంలో ఉన్న పార్టీ ప్రజావ్యతిరేక విధానాలను విమర్శించాలి. ఇటీవల జరిగిన అసెంబ్లీ సమావేశాల్లో ప్రవేశపెట్టిన అవిశ్వాస తీర్మానం సందర్భంగా అధికార పక్షాన్ని విడిచిపెట్టి, కిరణ్‌కుమార్‌రెడ్డి అసమర్ధ పాలనను వదలిపెట్టి అసెంబ్లీ లోపల బయట వైఎస్ జగన్‌ను తిట్టడానికి ప్రతిపక్ష తెలుగుదేశం తన సమయాన్ని వినియోగించింది. జగన్‌ను తిడితే ప్రజల మద్దతు పొందలేరు. రాష్ట్ర ప్రజల అభిమాన నాయకుడు జగన్‌ను విమర్శిస్తే జనం హర్షించరు. కాంగ్రెస్, టిడిపిలు ఏకమై ఎన్ని కుట్రలు చేసి జగన్‌ను తప్పుడు కేసుల్లో ఇరికించినా ప్రజలు జగన్ వెంటే ఉన్నారు. ఎన్నికలు ఎప్పుడు జరిగినా జగన్ సారథ్యంలోని వైకాపాను గెలిపించి జగన్‌ను సిఎంను చేసేందుకు ప్రజలు సిద్ధంగా ఉన్నారు.

*బి.ఆర్.శాలి* — కావలి

## సిఎం వస్తే కరెంటు తీయరు!

విద్యుత్ కోతలు ప్రజలను అల్లాడిస్తున్నాయి. కాని సిఎం వంటి ప్రముఖుల పర్యటనకు వస్తే ట్రాన్స్‌కో అధికారులు విద్యుత్ కోతలు విధించడం లేదు. ఈనెల మొదటివారంలో మూడు రోజులపాటు సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి నెల్లూరు జిల్లాలో పర్యటించారు. ఈ మూడురోజులపాటు విద్యుత్‌కోతను జిల్లాలోని ఏ ప్రాంతంలోనూ అమలు చేయలేదు. సిఎం ప్రజల కన్నా గొప్పవాడు కాదు. గ్రామాల్లో విద్యుత్‌లేక మంచినీటి పథకాలు, పిండిమిల్లులు, కూల్‌డ్రింక్ షాపులు మూసుకోవాల్సి వస్తుంది. ఆసుపత్రులలో రోగులు అల్లాడిపోతున్నారు. వీరందరూ ఇబ్బంది పడగా లేనిది కరెంట్ కష్టాలు సిఎం ఎందుకు పడకూడదు.

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**7-5-1943 పేజీలు : 4 వెల: 0-1-6**

### నెల్లూరు ముచ్చట్లు

### వి.ఆర్.హైస్కూల్

సంస్కృతాన్ని తెనుగులో బోధించవలసిన సంస్కృత పండితునికి బదులు
బ్రహ్మా – బ్రహ్మాదు
దూతః – దూతదు

తృణాని – గడ్డిలను అని సంస్కృతాన్ని సంస్కృతంలో పాఠాలు బోధించే తెనుగు రాని అరవ సంస్కృత పండితుడు తాతాచార్యుల వారిని నియమించారు. వైష్ణవాభిమానంతో వైకుంఠవాసులు మాడభూషి వారు ఎట్లో ఆ ఉద్యోగ ఆయుర్దాయం ఆగష్టులో సమాప్తి కానుండగా ఉభయరావు శ్రీ విరాజితులు వవ్వేటి వారు వీరికి మరొక సంవత్సరం ఆయుర్దాయం పొయ్యాలని చూస్తూ మీటింగులో బెట్టడానికి దొమ్ములు లేక సర్క్యులేషన్ ద్వారా జేస్తున్నారట. ఏమిటా ఈ వైష్ణవాభిమానం అంటే? యిది ప్రిన్సిపాల్ అయ్యంగార్ సిఫార్సుగా ఉంటుందని ఊహ. బహుశా వవ్వేటి వారి అగ్రికల్చరల్ అల్లుడు వృక్ష శాస్త్రజ్ఞుడుగా కాలేజికి రావలసి వస్తే ఫిలాసఫీ వారు యింగ్లీషు చెప్పంగా అగ్రికల్చరల్ వారు బాటని చెప్పొచ్చుననే కన్వెన్షన్ ప్రకారం ప్రిన్సిపాల్ సపోర్టు వుంటుందనే పరస్పర సహాయ కాంక్షే ఈ సంస్కృతుని పొడగింపుకు కారణంగా ఉంటుంది.

ఓ కమిటీవారూ! సింహపురి గొడ్డుబోలేదు. సంస్కృతాన్ని తెనుగులో బోధించగలిగిన ఉభయ భాషా పండితులెందరో వున్నారు.

కాబట్టి తాతా గారికి నమస్కారంతో ఉద్వాసనజెప్పి సంస్కృత తెనుగు పండితుణ్ణి నియమించమని మా సలహా.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**3-5-1963 పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### లేగుంటపాడు ఎర్రదుర్గం ముట్టడి!

*ఇంత మంది పెద్దలీవూరికేనాడు*
*వచ్చి నిల్చుకొని రచ్చమిందన*
*మైకు బెట్టుకొని మాట్లాడినది లేదు.*
*యింతవరకు, కొంత కొంత మెరుగు!*

–శివారెడ్డి

తమ కత్తికి ఎదురులేకుండా శాసిస్తూ, కాంగ్రెస్ వాదులను హింసిస్తున్న కోవూరు తాలుకాలోని కమ్యూనిస్టు ప్రధాన దుర్గాలలో ఒకటైన లేగుంటపాడును ముగ్గురు కాంగ్రెస్ శాసనసభ్యులు – శ్రీయుతులు రేబాల దశరధరామిరెడ్డి, జి.సి.కొండయ్య, ఆనం సంజీవరెడ్డి; జిల్లా పరిషత్తు ఛైర్మన్ నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి గారలు గత 25వ తేది రాత్రి ముట్టడించి ఎర్ర సోదరులను హెచ్చరించి, పిరికి కాంగ్రెస్ అభిమానులలో ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించి వచ్చారు.

లేగుంటపాడంటే ఎప్పుడూ ఎర్ర దేవతను కొలిచే గ్రామం. 1955, 1962 ఎన్నికలలో కమ్యూనిస్టులకు వరుసగా 405, 598 ఓట్లువస్తే, కాంగ్రెస్‌కు 347, 363 మాత్రం వచ్చాయి. అలాంటి గ్రామం లేగుంటపాడు.

రామ మందిరం వద్ద రైతు కాంగ్రెస్ సభ జరిగింది. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి అధ్యక్షత వహించారు. తాను మూడుసార్లు లేగుంటపాడుకు వచ్చానని, ఒకసారి వచ్చినపుడు కమ్యూనిస్టులు ఒక హరిజనుని చెయ్యి విరగగొట్టి వుండినారని, రెండవసారి వచ్చినపుడు ఒక స్త్రీని చిత్రహింసలకు గురిచేసి వుండినారని, ఇప్పుడు కాంగ్రెస్ సేవకుడైన శివారెడ్డిపైన దౌర్జన్యం జరిపారని చెప్తూ అణిగి వున్నంత కాలం ఇంతేనని; నాలుగు దెబ్బలుతిన్నా రెండన్నా వారికి వేయండని రైతులకు సలహా చెప్పారు సంజీవరెడ్డి.

# నెల్లూరు ముచ్చట్లు

## నెల్లూరు క్లబ్‌లో పేకాట!

పొదలకూరురోడ్డులోని నెల్లూరు క్లబ్‌లో పేకాట, మద్యం గ్లాసుల గలగలలు మళ్లీ మొదలయ్యాయి. డిజిపి దినేష్‌రెడ్డి ఆదేశాల మేరకు క్లబ్బులలో కొంతమేర పేకాట ఆగింది. నెల్లూరు క్లబ్‌లో కూర్చొని తాగి ఇష్టమొచ్చినట్లు తనను మాట్లాడిన కారణంగా క్లబ్‌లో ఎన్నో లక్షలు వెచ్చించి కట్టిన భవనాన్ని రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి చట్టాన్ని ఆసరాగా చేసుకొని పడగొట్టించాడు. క్లబ్ పాలకవర్గ బాధ్యతలు మారిన తర్వాత పేకాట మొదలయ్యింది. దీంతో నెల్లూరు క్లబ్‌లో పెద్ద పేకాటరాయుళ్ల సందడి మళ్లీ మొదలయ్యింది.

## రాజకీయాలు కుళ్లిపోయాయి!

రాష్ట్రంలో రాజకీయాలు కుళ్లిపోయాయని, సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ కుండబద్దలు కొట్టారు. దివంగత సిపిఐ నాయకుడు గునుపాటి రామచంద్రయ్య వర్ధంతి కార్యక్రమంలో పాల్గొనను నెల్లూరు వచ్చిన నారాయణ విలేకరులతో మాట్లాడారు. గుడిలో దేముంటాడు. జైళ్లలో దొంగలుంటారు. కొంత మంది నేతలు దొంగల వద్దకు వెళ్లి ఆశీర్వాదాలు తీసుకొంటున్నారు. పోటీ చేయను బి-ఫారాలు తెచ్చుకొంటున్నారని వైఎస్‌ఆర్ పార్టీ నేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని ఉద్దేశించి మాట్లాడారు. కోటీశ్వరులు తమ అక్రమ ఆస్తులు రక్షించుకోను రాజకీయాల్లోకి వస్తున్నందు వల్లే లోక్‌సభలో సభ్యులుగా 230 మంది కోటీశ్వరులున్నారన్నారు. ఇదే తరహాలోనే కర్నాటక అసెంబ్లీ ఎన్నికల్లో వందల మంది కోటీశ్వరులు బరిలో ఉన్నారని నారాయణ వ్యాఖ్యానించారు.

## మొండి మగాడు!

తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబునాయుడు మొండి మగాడని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి విమర్శించారు. రాపూరు మండలంలోని పెంచలకోన లక్ష్మీనరసింహ స్వామి సన్నిధిలో అమ్మహస్తం పథకాన్ని 29వ తేది రామనారాయణరెడ్డి, మరో మంత్రి వట్టి వసంత్‌కుమార్‌తో కలసి ప్రారంభించారు. ఈ సందర్భంగా రామనారాయణరెడ్డి మాట్లాడుతూ అమ్మహస్తం పథకాన్ని చంద్రబాబునాయుడు మొండి హస్తంగా అభివర్ణిస్తున్నారు. వాస్తవానికి ఆయనే మొండి మగాడుగా మారాడని రామనారాయణరెడ్డి ఎద్దేవా చేశారు. ఈ మధ్య రామనారాయణరెడ్డి దూకుడుగా మాట్లాడుతున్నారు. కారణమేమిటో ఆయనకే తెలియాలి.

## నెల్లూరులో డిజిపి!

డిజిపి దినేష్‌రెడ్డి 26, 27, 28 తేదీల్లో నెల్లూరులోనే ఉండినారు. శాఖాపరంగా కొన్ని సమావేశాల్లో ఆయన పాల్గొన్నా వాస్తవానికి ఆయనకు పిల్లనిచ్చిన మామ అనారోగ్యానికి గురి కావడంతో దగ్గరుండి పర్యవేక్షించను వచ్చినట్లు విశ్వసనీయంగా తెలిసింది.



## రికార్డు డ్యాన్సర్లపై ఉక్కుపాదం!

టీవీల్లో, సినిమాల్లో వచ్చే అశ్లీల నృత్యాలను అరికట్టలేని పోలీసులు పొట్టకూటికోసం శ్రీరామనవమి ఉత్సవాల్లో నర్తించను వచ్చిన రికార్డు డ్యాన్సర్లపై ఉక్కుపాదం మోపారు. చిల్లకూరు ప్రాంతంలో నర్తిస్తుండిన వీరిని పోలీసులు పట్టుకొని ఎస్పీ దగ్గరకు తీసుకోరాగా ఆయన ప్రెస్‌మీట్ పెట్టి వాళ్లను అరెస్ట్ చేస్తున్నట్లు చెప్పారు. మొత్తంమీద ఈ అరెస్టులతో గ్రామాల్లో శ్రీరామనవమి ఉత్సవాల్లో సందడి లేకుండా ముగిశాయి.

## నెల్లూరులో రామదూతస్వామి!

నెల్లూరులో మంచి ఫాలోయింగ్ ఉన్న రామదూత స్వామి 28వ తేది కస్తూరిదేవి గార్డెన్స్‌లో వేణుదత్త సువర్ణలక్ష్మి దాంపత్యయాగాన్ని నిర్వహించారు. యాగాలతో దేశం సుభిక్షంగా ఉంటుందని, జనానికి మంచి జరుగుతుందని స్వామి చెప్పుకొచ్చారు.

## గూడూరు డిఎస్పీ బదలీ!

గూడూరు డిఎస్పీగా హైదరాబాద్ నుంచి ఎంత వేగంగా వచ్చివాలాడో అంతే వేగంతో హనుమంతరావు మళ్లీ వచ్చిన చోటుకే వెళ్లిపోయాడు. డివిజన్‌లో శాంతి భద్రతలు, అసాంఘిక కార్యక్రమాలు, ఎర్రచందనం స్మగ్లింగ్ ఎక్కువ కావడంతో దినేష్‌రెడ్డి హనుమంతరావును బదలీచేసి గ్రేహౌండ్స్ విభాగంలో పనిచేస్తుండిన చౌడేశ్వరిని ఇక్కడ నియమించారు.

## స్టాండింగ్ కమిటీ చైర్మన్‌గా బీద!

శాసనసభలో కొత్తగా ఏర్పాటు చేసిన కార్మిక, ఉపాధి కల్పన, సాంస్కృతిక, పర్యాటక, ఐటి విభాగాల స్టాండింగ్ కమిటీ చైర్మన్‌గా కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు నియమితులయ్యారు. ప్రతిపక్ష ఎమ్మెల్యే కోటాలో మస్తాన్‌రావుకు ఈ అవకాశం దక్కింది. ఈ పదవి ద్వారా ప్రజలకు చేయగలిగిన సేవచేస్తానని మస్తాన్‌రావు వినమ్రంగా ప్రకటించారు.

## కార్పొరేషన్ ఉద్యోగుల సస్పెండ్!

వేదాయపాళెంలోని అపార్ట్‌మెంట్ నిర్మాణానికి అనుమతివ్వడానికి లంచం డిమాండ్‌చేసి మూడున్నర లక్షల రూపాయల మొత్తం తీసుకుంటూ ఎసిబి వలలో పడ్డ బిల్డింగ్ ఇన్‌స్పెక్టర్ మధు, అటెండర్లు బాబురావు, శ్రీనివాసులురెడ్డిలను సస్పెండ్ చేస్తూ మునిసిపల్ పట్టణాభివృద్ధి శాఖ ఆలస్యంగా ఉత్తర్వులు జారీ చేసింది. మామూలుగా లంచం కేసుల్లో అరెస్ట్ చేసిన ఉద్యోగులను 24 గంటల్లో సస్పెండ్ చేయడం రివాజు. ఆలస్యం చేసి మునిసిపల్ శాఖ విమర్శలపాలయ్యింది.

## కాంట్రాక్టులు ఎందుకు చేయకూడదు?

నిబంధనల ప్రకారం నమోదైన ప్రజాప్రతినిధుల బంధువులు కాంట్రాక్టులు ఎందుకు చేయకూడదని నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి ప్రశ్నించారు. ఆయన కుమారుడు, అన్న కుమారుడు నెల్లూరులో వందల కోట్ల రూపాయల కాంట్రాక్టు పనులు చేస్తున్నారు. నాణ్యతాపరంగా ఆ పనులు సరిగ్గాలేవన్న విమర్శలు వస్తున్న నేపథ్యంలో ఎమ్మెల్యే వాళ్లకు మద్దతుగా మాట్లాడడం నగరంలో చర్చనీయాంశమయ్యింది.

## ప్రపంచ కవుల మొదటి వరసలో శ్రీశ్రీ!




మహాకవి శ్రీశ్రీ 103వ జయంతి సభను 30వ తేది టౌన్‌హాల్‌లో శ్రీశ్రీ ప్రగతి ట్రస్ట్ నేతృత్వంలో న్యాయవాది వేములపాటి అనంతరామయ్య ఘనంగా నిర్వహించారు. ఈ మధ్య టౌన్‌హాల్‌లో జరిగే సాహిత్య సభల్లో ఎప్పుడూ లేనంతగా శ్రోతలు ఈ సభకు హాజరయ్యారు. సభలో కపడకు చెందిన సాహితీవేత్త డాక్టర్ పి.సంజీవమ్మ మాట్లాడుతూ మార్క్సిజాన్ని చెప్పడం వల్లే శ్రీశ్రీ సాహిత్యానికి అంత శక్తి వచ్చింది. ప్రపంచ కవుల్లో మొదటి వరుసలో ఉండదగ్గ కవిత్వాన్ని శ్రీశ్రీ వ్రాశాడు. మానవుడే దేముడన్న శ్రీశ్రీ అని ఆయనకు జ్ఞానపీఠ్ అవార్డు రాలేదని ఆయన అభిమానులు ఎవరూ బాధపడడం లేదన్నారు. అనంతపురం జిల్లాకు చెందిన సాహితీవేత్త సింగమనేని నారాయణ ఉపన్యాసం అందరినీ ఆలోచింప చేసింది. ప్రపంచ చరిత్ర పరికిస్తే పాలకవర్గాలన్నీ ఫ్యూడల్ భావజాలంతోనే నడుస్తుంటాయన్నారు. చరిత్ర అంటే రాజులు కాదు శ్రమజీవులు, ప్రజలని శ్రీశ్రీ చెప్పారు. శ్రీశ్రీ మహాప్రస్థానం చదివాక ఎవరూ ఏ ఒక్కరిపై అధికారం చలాయించలేని విధంగా మానవీయంగా మారుతారని నారాయణ స్పష్టం చేశారు. ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం, మజ్జిగ ప్రభాకర్‌రెడ్డి, డాక్టర్ తెలికచర్ల సుబ్బయ్య వేదికపై ఆశీనులయ్యారు. డాక్టర్ కాళిదాసు పురుషోత్తం వక్తలను సభకు పరిచయం చేశారు. సభ బాగా జరగడంతో అనంతరామయ్య మోము వికసించింది.

## ఇంటర్ ఫలితాల్లో పట్టు నిలుపుకొన్న జిల్లా!

ఇంటర్మీడియట్ ద్వితీయ సంవత్సరం ఫలితాల్లో రాష్ట్రంలో మూడవ స్థానంలో నిలిచింది. 23,401 మంది విద్యార్థులు ఈ పరీక్ష వ్రాయగా 17,291 మంది పాస్ అయ్యారు. బాలురు 12,679 మంది పరీక్ష వ్రాయగా 10,722 మంది ఉత్తీర్ణులయ్యారు. బాలికలు 9067 మంది పరీక్షకు హాజరవ్వగా 8,244 మంది ఉత్తీర్ణులయ్యారు.

## విశ్వసాయి హవా!

సీనియర్ ఇంటర్ పరీక్షా ఫలితాల్లో నెల్లూరు మాగుంట లేఅవుట్‌లోని విశ్వసాయి జూనియర్ కాలేజి విద్యార్థులు అద్భుత ఫలితాలు సాధించారు. బైపిసి విభాగంలో అమ్మనబ్రోలు శ్రావ్య వెయ్యి మార్కులకు గాను 988 మార్కులు సాధించి రాష్ట్ర స్థాయిలో రెండవ స్థానంలో నిలవగా, ఎ.ఎస్.ఎ.నివాళిక 984 మార్కులు సాధించి ఆరవ స్థానంలో నిలిచింది. ఎమ్పీసి విభాగంలో కె.గౌతమ్ సాగర్‌రెడ్డి వెయ్యి మార్కులకు గాను 983, నిశాంత్ 979 మార్కులు సాధించారు. నెల్లూరులో ఉన్న ఒకే ఒక బ్రాంచిలో అతి తక్కువ మంది విద్యార్థులతో ఈ విజయాలు సాధించామని విశ్వసాయి విద్యాసంస్థల నిర్వాహకుడు డాక్టర్ సత్యనారాయణ చెప్పారు.

## చంద్రారెడ్డి జూనియర్ కళాశాల ప్రతిభ

ఇంటర్ ద్వితీయ సంవత్సరం ఫలితాల్లో నెల్లూరు మద్రాసు బస్టాండ్ వద్ద గల చంద్రారెడ్డి జూనియర్ కళాశాల

కొరవ 14వ పేజీలో

# స్వరాజ్య స్థాపనే లోక్‌సత్తా లక్ష్యం!

● నెల్లూరులో పార్టీ రాష్ట్ర అధ్యక్షుని ప్రకటన

లోక్‌సత్తా పార్టీ రాష్ట్ర అధ్యక్షునిగా ఎన్నికైన కటారి శ్రీనివాసరావు, ప్రధాన కార్యదర్శి పి.రవిమారుతితో కలసి 26వ తేది నెల్లూరు వచ్చారు. రామలింగాపురంలోని పార్టీ జిల్లా కార్యాలయంలో పార్టీ విస్తృతస్థాయి సభ్యుల సమావేశంలో పాల్గొన్న శ్రీనివాసరావు మాట్లాడుతూ 15 ఏళ్లుగా లోక్‌సత్తాలో పనిచేస్తున్న ఒకే ఒక్క కారణంతో నన్ను అక్కున చేర్చుకొని పార్టీ రాష్ట్ర అధ్యక్ష బాధ్యతలు అప్పజెప్పారు. నాకు రాజకీయ వారసత్వంకానీ, కుల, ధన, అంగబలం కానీలేవు. బలహీన వర్గాలకు చెందిన తనకు ప్రజాస్వామ్యబద్ధంగా ఈ బాధ్యత అప్పగించడం రాష్ట్ర రాజకీయ చరిత్రలో ఒక నూతన అధ్యాయానికి తెరతీసిందన్నారు. యువత, మహిళలు, బలహీనవర్గాలకు పార్టీలో అన్నిరకాల బాధ్యతలు అప్పజెప్పేది వారి స్థాయి పెంచేది ఒక్క లోక్‌సత్తానే అన్నారు.




వేదికపై లోక్‌సత్తా రాష్ట్ర అధ్యక్షుడు కటారి శ్రీనివాసరావు.

రాష్ట్ర కార్యదర్శి రవిమారుతి మాట్లాడుతూ రకరకాల డిగ్రీలు చేసిన వాళ్లు, ఇంజనీరింగ్ పట్టభద్రులు లక్షల మంది బయటకు వస్తుంటే కనీసం వేల సంఖ్యలో కూడా ఉపాధి కల్పించక పాలక పక్షాలు తప్పుడు వాగ్దానాలతో కాలం వెళ్లదీస్తున్నాయి. స్వరాజ్య స్థాపనే లక్ష్యంగా పని చేస్తున్న లోక్‌సత్తా వీరందరినీ అక్కున చేర్చుకుని ముందడుగు వేస్తుందన్నారు. డాక్టర్ జయప్రకాష్ నారాయణ ప్రాతినిధ్యం వహించే కూకట్‌పల్లి నియోజకవర్గంలో వేలాది మంది యువతకు ఒక ప్రణాళిక ప్రకారం ఉద్యోగాలు కల్పించడంలో సహకారమందించామన్నారు. సమావేశంలో పార్టీ నాయకులు రమేష్‌రెడ్డి, జె.వి.రామ్మూర్తి, నర్రా శ్రీధర్, ఎమ్.అంకయ్య చౌదరి, ఎం.ఎస్.మణి యాదవ్, జె.ఎల్.నారాయణ, జె.ఎన్.లత, ఎస్ఎస్‌నాయుడు, బాబురావు, రసూల్ పాల్గొన్నారు.

# సేవలకు రోటరీ సత్కారాలు




వివిధ ప్రభుత్వ శాఖల్లో ఉత్తమ సేవకులకు సన్మాన దృశ్యం.

ప్రజలకు ఉత్తమ సేవలందించే ప్రభుత్వ శాఖల్లోని ఉద్యోగులను సన్మానించడం ఒక కార్యక్రమంగా పెట్టుకొంది నెల్లూరు రోటరీ క్లబ్. ఈ యేడాదికిగాను ఉత్తమ ఆర్టీసి డ్రైవర్‌గా పి.శీనయ్య, పోస్ట్‌మెన్‌గా ఎం.శ్రీనివాసులు, ట్రాఫిక్ కానిస్టేబుల్‌గా ఎస్.సుందరరామిరెడ్డి, 108 ఎమర్జెన్సీ మెడికల్ టెక్నీషియన్‌గా పి.కృష్ణయ్య, ప్రసూతి వైద్యశాల నర్స్‌గా వమోల ఎవాంజిలియన్, కార్పొరేషన్ డ్రైనేజ్ వర్కర్‌గా ఎం.రాజేష్‌ను 25వ తేది సన్మానించారు. వీరికి రోటరీ ప్రశంసాపత్రంతోపాటు వెయ్యి రూపాయల నగదును ప్రోత్సాహకంగా అందించారు. ఈ కార్యక్రమంలో రోటరీ అధ్యక్ష, కార్యదర్శులు కె.మధుసూధన్‌రావు, కె.వి.సుబ్రహ్మణ్యం ఇతర రొటేరియన్లు పాల్గొన్నారు.



ఖజానా ప్రారంభోత్సవం సందర్భంగా జ్యోతిప్రజ్వలన చేస్తున్న తమన్నా.

# నెల్లూరులో ఖజానా జ్యూవెలరీ!

## ప్రారంభించిన నటి తమన్నా

దేశంలో ప్రముఖమైన జ్యూవెలరీ బ్రాండ్ అయిన ఖజానా షోరూంను సినీనటి తమన్నా 26వ తేది సాయంత్రం ఆచారివీధిలో జ్యోతి వెలిగించి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఖజానా జ్యూవెలరీ మేనేజింగ్ డైరక్టర్ కిషోర్‌జైన్ మాట్లాడుతూ నెల్లూరు వ్యాపార కేంద్రంగా వర్ధిల్లుతోంది. నెల్లూరీయులకు నగలంటే అమిత ఇష్టం. అందుకే ఖజానా షోరూంను నెల్లూరులో ప్రారంభిస్తున్నాం. భారతదేశమంతా ఉన్న మా స్వంత ఉత్పత్తి కేంద్రాల్లో మేమే బంగారు నగలను తయారు చేస్తున్నందువల్ల డిజైన్, నాణ్యత, నగిషీలపై మాకు పట్టు చిక్కి ఖాతాదారుల మనసు దోచాం. అతి తక్కువ ధరలకు నగలను అందుబాటులోకి తీసుకు రాగలుగుతున్నాం. మా బ్రాండ్‌కు ఆంధ్రప్రదేశ్‌లో 14 దుకాణాలున్నాయి. నెల్లూరులో షోరూం ప్రారంభ ఆఫర్‌గా ఖాతాదారులకు గ్రాముకు 60 రూపాయలు తగ్గింపును ప్రకటించాం. ఖజానా జ్యూవెలరీ తమ ఖాతాదారుల కోసం ది గోల్డెన్ ఫ్రూట్, గోల్డెన్ డిజైన్ పేరిట నిత్య పొదుపు పథకాలను కూడా అందుబాటులోనికి తెచ్చామన్నారు. తమ షోరూంలో అమ్మే అన్ని ఆభరణాలలో బిఐఎస్ 916 హాల్‌మార్క్ ఉంటుందని ఈ సందర్భంగా స్పష్టం చేశారు. ఈ కార్యక్రమంలో సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి కూడా పాల్గొన్నారు.

● దొంగలతో

# పోలీసుల మిలాఖత్!

## కప్పరాళ్లతిప్ప స్టేషన్ చెడిపోయింది

ప్రజలకు రక్షణ కల్పించాల్సిన పోలీసులు అసాంఘిక శక్తులు, నేరస్తులు, దొంగలతో చేతులు కలిపి ఆ శాఖ పరువు బజారుపాలు చేస్తున్నారు. దొంగలు, నేరగాళ్లకు పోలీసులకు మధ్య వున్న స్నేహ సంబంధాలు ఈనాటివి కావు. వాళ్లతో వీళ్లు, వీళ్లతో వాళ్లు చెట్టాపట్టాలేసుకుని చెలిమి చేస్తున్నారు. జేబులు కత్తిరించే చిల్లర నేరస్తుల నుంచి దొంగతనాలు, దోపిడీ దారులు, జూదశాల నిర్వాహకులు, బ్లాక్ టిక్కెట్లు అమ్మేవారు, క్రికెట్ బెట్టింగ్ నిర్వాహకులు, సింగిల్ నెంబర్ నిర్వాహకులు, వ్యభిచార గృహాల నిర్వాహకులు ఇలా సకల సబ్బండు కార్యక్రమాలు నిర్వహించే వారితో అక్రమ సంబంధాలు కల్గి వున్నవారు పలువురు పోలీసులు. అందరి దగ్గర వాటాలు తీసుకొంటుంటారనే ఆరోపణలు వెల్లువెత్తుతుంటాయి. పోలీసులు దాడి చేయాల్సి వస్తే వీరికి ముందుగానే సమాచారం అందిస్తుంటారు కొందరు పోలీసులు. ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలేడన్నట్లు ఇంతకాలం తప్పించుకు తిరుగుతున్న ఇలాంటి పోలీసుల బండారం కావలిలో బట్టబయలైంది. ఇటీవల కావలి డిఎస్పీ ఇందిర గన్‌మెన్‌పై దొంగలు దాడిచేసి గాయపరచిన సంగతి తెలిసిందే. ఈ వ్యవహారమై డిఎస్పీ లోతుగా దర్యాప్తు జరపడంతో పలు ఆసక్తికరమైన విషయాలు వెలుగు చూశాయి. కొంత మంది పోలీసుల పాత్రపై అనుమానం వుంచిన పోలీసు అధికారులు, వారి ఫోన్‌లపై నిఘా వుంచి సమాచారం సేకరించగా పలువురు దొంగలతో రహస్య మంతనాలు చేయడం, సమాచారం చేరవేస్తున్నట్లు తెలియడంతో దీనితో సంబంధమున్న ముగ్గురు కప్పరాళ్లతిప్ప స్టేషన్ పోలీసులను సస్పెండ్ చేశారు. ఈ వ్యవహారం జిల్లా పోలీసు శాఖలో కలకలం రేపింది.

# డిఎంఅండ్‌హెచ్‌ఓ పేరిట వసూళ్లు!

## మోసపోయిన నెల్లూరు డాక్టర్లు

నెల్లూరు నగరంలో ప్రైవేటు ఆసుపత్రుల నుంచి కొందరు వ్యక్తులు వైద్య ఆరోగ్య శాఖాధికారి పేరు చెప్పి వసూళ్లకు పాల్పడుతున్నారు. వారి వద్దకెళ్లి రిజిస్ట్రేషన్లు చేయించుకోవాలని, లింగ నిర్ధారణ వరీక్షలు చేస్తున్నారని బెదిరించి వసూళ్లు చేసినట్లు తెలిసింది. జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి పేరు చెప్పడం, వచ్చినవారు హుందాతనంగా వ్యవహరించడంతో ఎటువంటి సందేహం లేకుండానే రెండు వేల రూపాయల నుంచి ఐదు వేల రూపాయల వరకు ముట్టజెప్పారు. వసూళ్ల గురించి ఇండియన్ మెడికల్ అసోసియేషన్ ప్రతినిధుల దృష్టికి వెళ్లడంతో వారు వైద్య ఆరోగ్య శాఖాధికారిని సంప్రదించడంతో అసలు విషయం వెలుగులోకి వచ్చింది. ఐఎంఏ ప్రతినిధులు ఆ శాఖ కార్యాలయానికి వెళ్లిన సమయంలో వసూళ్లకు వచ్చిన వారిలో ఒక వ్యక్తి కార్యాలయంలో ప్రత్యక్షమవ్వడాన్ని గుర్తించారు. అతన్ని ప్రశ్నించేలోగా అక్కడ నుంచి వెళ్లిపోయారు. డిఎంఅండ్‌హెచ్‌ఓ మాత్రం వసూళ్ల గురించి తనకు సంబంధం లేదని, అటువంటి వారిపై పోలీసులకు ఫిర్యాదు చేస్తామని చెప్పారు. ఈ నెలాఖరుకు పదవీ విరమణ చేయనున్న జిల్లా అధికారి కొందరు ప్రైవేటు వ్యక్తుల ద్వారా ప్రైవేటు ఆసుపత్రుల నుంచి వసూళ్లు చేయించాడని కార్యాలయంలో చర్చించుకొంటున్నారు. ఐఎంఏ ఆధ్వర్యంలో ఆందోళన చేపట్టాలని ముందుగా నిర్ణయించుకున్నప్పటికీ అధికారులు తనిఖీలు చేస్తే ల్యాబ్‌లు, ఆసుపత్రుల రిజిస్ట్రేషన్లు చేయించుకోని విషయం బయటపడితే మరిన్ని సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుందన్న ఉద్దేశంతో మౌనంగా వుండి పోయినట్లు తెలిసింది. ఏదిఏమైనా ప్రైవేటు ఆస్పత్రుల వద్ద దాదాపు ఐదు లక్షలకు పైగా వసూళ్లు చేసినట్లు సమాచారం.

# ఎజెసి ఆకస్మిక పర్యటనలు!

## ప్రయోజనం కనపడాలి?

నెల్లూరు నగర పాలక సంస్థ ప్రత్యేకాధికారిగా పెంచలరెడ్డి నగరంలో పలు ప్రాంతాల్లో ఆకస్మిక తనిఖీలకు శ్రీకారం చుట్టారు. ప్రత్యేకాధికారిగా బాధ్యతలు చేపట్టిన ఆయన కార్యాలయ పరిశీలనతోపాటు పారిశుధ్యంపై ప్రత్యేక దృష్టి సారించారు. ప్రతి రోజు ఉదయం 6 గంటలకు సిబ్బంది పనిచేసే ప్రాంతాలకు వెళ్లి వారి పని విధానాన్ని పరిశీలిస్తున్నారు. ఇటీవల కార్పొరేషన్ కార్యాలయంపై ఏసిబి అధికారులు దాడులు చేసి మూడున్నర లక్షల రూపాయల లంచం తీసుకుంటుండగా ఓ బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్ మరో ఇద్దరు ఉద్యోగులను పట్టుకున్న సంగతి తెలిసిందే. ఈ సంఘటనతో కార్పొరేషన్ కార్యాలయంలో ఏమేరకు అవినీతి చోటుచేసుకుందో బహిర్గతమైంది. అన్ని విభాగాల్లో ఇదే పరిస్థితి కొనసాగుతోంది. దీంతో ప్రత్యేకాధికారి అధికారులతో సమీక్షా సమావేశం ఏర్పాటుచేసి అవినీతికి పాల్పడే వారిని గట్టిగా హెచ్చరించారు. ప్రధానంగా ఇంజనీరింగ్ విభాగం, టౌన్‌ప్లానింగ్, పబ్లిక్ హెల్త్, జనన, మరణ ధృవీకరణ పత్రాలు జారీచేసే విభాగాల్లో పెండింగ్‌లో వున్న ఫైళ్ల వివరాలు సేకరించారు. నిర్ణీత సమయంలో ప్రజల సమస్యలను పరిష్కరించాలని ఆదేశించారు. ఇన్‌ఛార్జ్ కమిషనర్‌గా వున్న ఎంఇ సంపత్‌కుమార్ సిబ్బంది పట్ల మెతక వైఖరి అవలంభిస్తుండడంతో పనులు జరగడంలేదన్న విమర్శలు వున్నాయి. పెంచలరెడ్డి ఆకస్మిక తనిఖీలతో అధికారులు సిబ్బందిని పరుగులు తీయిస్తున్నారు.

## 108 సిబ్బంది నిరాహార దీక్షలు

తమ సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ గత 15 రోజుల నుంచి 108 సిబ్బంది కలక్టరేట్ ఎదుట నిరాహార దీక్షలు చేస్తున్నారు. 108 వాహనాల ద్వారా అత్యవసర సేవలు అందిస్తున్న సిబ్బందికి గతంలో ప్రభుత్వం పలు హామీలు చేసింది. వేతనాలు పెంచడం, సిబ్బందిని క్రమబద్ధీకరించడం, ఉద్యోగ భద్రత కల్పించడం వంటి హామీలు ఇందులో వున్నాయి. గతంలో రాష్ట్రవ్యాప్తంగా 108 సిబ్బంది సమ్మె చేయడంతో ప్రభుత్వం యూనియన్ నేతలతో పలు దఫాలు చర్చలు జరిపి సమ్మె విరమింపజేసింది. కానీ ఇచ్చిన హామీలను మాత్రం సంవత్సరం గడుస్తున్నా నేటికీ అమలు చేయకపోవడంతో నిరాహార దీక్షలకు దిగారు.

## గూడూరు వైకాపాలో వర్గపోరు!

గూడూరు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలో ముఠా కుమ్ములాటలు తారాస్థాయికి చేరుకొన్నాయి. ఇక్కడ పార్టీ ఆవిర్భావం నుంచి బత్తిన విజయకుమార్, మాజీ మున్సిపల్ ఛైర్మన్ పాశం సునీల్‌కుమార్‌లు పని చేస్తున్నా ఎవరికి వారు వేరు కుంపట్లు పెట్టుకొని వున్నారు. ఇటీవల జరిగిన నియోజకవర్గ సమన్వయకర్తల నియామకాల్లో పాశం సునీల్‌తోపాటు, మాజీ జిల్లా పరిషత్ ఛైర్మన్ డాక్టర్ బాలచెన్నయ్యకు ఈ బాధ్యతలు కట్టబెట్టి, పార్టీ కోసం చురుకుగా పనిచేస్తుండిన విజయకుమార్‌కు మొండిచేయి చూపారు. దీంతో కినుక వహించిన బత్తిన పార్టీ కార్యక్రమాలకు, పార్టీ వ్యవహారాలకు అంటీ ముట్టనట్లుగా

### ఎవరికి వారే యమునా తీరేలా నాయకులు

వ్యవహరిస్తుండడంతో ఈ వర్గపోరు తీవ్రమైంది. పార్టీ అభివృద్ధికి, ప్రజల్లోకి పార్టీని తీసుకెళ్లేందుకు కృషి చేసిన విజయకుమార్ ఇప్పుడు ఎవరితోను కలవకుండా ఒక్కడిగానే కార్యక్రమాలు జరుపుతుండడం చర్చనీయాంశమయ్యింది. ఇటీవల ఢిల్లీలో చిన్నారిపై జరిగిన లైంగిక దాడిని నిరసిస్తూ కొవ్వొత్తుల ప్రదర్శన చేసిన ఆయన ఎక్కడా పార్టీ పేరు వాడకుండా, బ్యానర్‌లో ఎవరి పేరు వ్రాయించకుండా ఆందోళన కార్యక్రమం చేపట్టడం ఈ వర్గపోరును తెలియజెప్పింది. మరోవైపు నియోజకవర్గ పరిధిలో సమన్వయకర్తలుగా నియమించిన సునీల్, బాలచెన్నయ్యల మధ్య పొసగడం లేదు. వీరిరువురు పోటీపోటీగా వేరువేరుగా కార్యక్రమాలు జరుపుతున్నారు. నేతల మధ్య సమన్వయం కొరవడడంతో కార్యకర్తల్లోను అయోమయం నెలకొంటుంది. వీటిని ఎవరు చక్కదిద్దుతారో?

## కలువాయిలో వరుస దుర్ఘటనలు!

### చెరువులో పడి పిల్లలు- బావిలో పడి ప్రేమికుల దుర్మరణం



ఆత్మహత్య చేసుకున్న ప్రేమికులు పుష్ప, శ్రీనివాసులు.

ఈత సరదా ఇద్దరు అన్నదమ్ముల ప్రాణాలు బలి తీసుకొంటే, పెద్దలు అంగీకరించకపోవడంతో ప్రేమికులు ఆత్మహత్య చేసుకొన్నారు. కలువాయి మండలంలో చోటు చేసుకొన్న ఈ ఘటనలు ఆయా గ్రామ ప్రజలు, కుటుంబసభ్యుల్లో విషాదం నింపాయి. మండలంలోని చీపినాపికి చెందిన శ్రీనివాసులు, పుష్ప కలువాయిలోని ప్రైవేట్ కళాశాలలో డిగ్రీ, ఇంటర్ చదువుతున్నారు. ఒకే కళాశాలలో చదువుతుండడంతో వీరి మధ్య వున్న స్నేహం కాస్త ప్రేమకు దారి తీసింది. ఈ విషయం పెద్దలకు తెలియడంతో వారు మందలించారట. ఈ సమస్యలతో ఇరువురి చదువు దెబ్బతింది. కులాలు వేరు కావడం, పెద్దలు ఒప్పుకోకపోవడంతో కలసి జీవించలేమని అనుకొన్న ఈ ప్రేమికులు కలసి మరణించేందుకు సిద్ధమయ్యారు. శ్రీరామనవమి ఉత్సవాల సందర్భంగా అందరు ఉత్సహంగా వుండగా వీరిరువురు చెరువు సమీపాన గల బావిలో దూకి ఆత్మహత్య చేసుకొన్నారు. ఇరువురి చెప్పులు, నగలు, సెల్‌ఫోన్లు పడి వుండడంతో ఇరు కుటుంబాల వారు గాలించగా మృతదేహాలు దొరకడంతో విషాదం నెలకొంది.

మండల పరిధిలోని కుల్లూరు కుమ్మర కాలనీకి చెందిన ప్రవీణ్, అభిలాష్ అనే అన్నదమ్ములు గ్రామ సమీపాన గల పెన్నానదిలో ఈత కొట్టేందుకు వెళ్లి మృత్యువాతపడ్డారు. దేవరకొండ వెంకట కృష్ణయ్య, వెంకట రమణమ్మ దంపతులకు వీరిద్దరే సంతానం. వేసవిలో సరదాగా ఈత కొడదామని నదిలో దిగిన వీరిరివురిలో ప్రవీణ్ మునిగిపోతుండగా అతన్ని రక్షించే యత్నంలో అభిలాష్ కూడా నీట మునిగి మరణించారు. ఎంతో భవిష్యత్ గల కుమారులిద్దరూ మృత్యువాత పడడంతో ఆ కుటుంబంలో విషాద ఛాయలు అలుముకొన్నాయి.

## ముత్యాలమ్మకు బంగారు హారం!

### అజ్ఞాత భక్తుని వితరణ

చిల్లకూరు మండలం తూర్పుకనుపూరులో వెలసిన శ్రీ ముత్యాలమ్మకు పచ్చరాయి పొదిగిన బంగారు హారాన్ని కానుకగా అందించాడు ఒక అజ్ఞాత భక్తుడు. 1.50 లక్షలు విలువచేసే ఈ హారాన్ని తన పేరు చెప్పడానికి ఇష్టపడని భక్తుడు ఆలయ మాజీ ఛైర్మన్ వేమారెడ్డి మురళీరెడ్డికి అందించాడు. ఆయన ఆ హారాన్ని తన చేతుల మీదుగా దేవస్థానానికి సమర్పించారు.

## ఆదెమ్మ సత్రం హాస్టల్ ఎత్తివేత?

ఇందుకూరుపేట మండలం ఆదెమ్మ సత్రంలో గల బాలుర హాస్టల్‌ను ఎత్తి వేసేందుకు అధికారులు రంగం సిద్ధం చేశారు. జిల్లాలో విద్యార్థుల సంఖ్య తక్కువగా వున్న సంక్షేమ హాస్టళ్లను ఎత్తివేయాలని ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంలో భాగంగా ఇక్కడి హాస్టల్‌ను మూతవేసేందుకు సిద్ధమయ్యారు. 50మందికి తక్కువ వుండే హాస్టళ్లను గుర్తించిన అధికారులు వీటిని ఎత్తేసేందుకు అన్ని రకాల చర్యలు చేపడుతున్నారు. ఇప్పటికీ హాస్టల్‌ను మూసివేసిన అధికారులు అధికారికంగా ప్రకటన మాత్రం చేయలేదు. ప్రభుత్వ నిర్ణయంతో విద్యార్థులు, వారి తల్లిదండ్రులు మండి పడుతున్నారు. హాస్టళ్లలో మౌలిక సదుపాయాలు కల్పించకుండా, విద్యార్థులకు కనీస సౌకర్యాలు ఏర్పాటుచేయక, మెనూ సరిగా అమలయ్యేలా చూడని అధికారులు దీనిని ఎత్తి వేయాలని చూడడం విమర్శల పాలౌతుంది.

# కోడూరు చెరువును అమ్మేస్తున్నారు!

● సహకరిస్తున్న రెవిన్యూ సిబ్బంది



తోటపల్లి గూడూరు మండలంలోని కోడూరు చెరువును అక్రమార్కులు ఆక్రమించి ఏకంగా అమ్మకానికి పెట్టేశారు. వీరికి కొందరు రెవెన్యూ సిబ్బంది సహకరిస్తుండడంతో 15 గ్రామాలకు, మజరా గ్రామాలకు సాగునీటిని, త్రాగునీటిని అందించే ఈ చెరువు మెల్లమెల్లగా కనుమరుగైపోతోంది. ఈ చెరువుపై ఆధారపడి ఎన్నో కుటుంబాలు జీవనోపాధి పొందుతున్నాయి. అలాంటి చెరువును రాజకీయ పలుకుబడి కల్గిన కొందరు ఆక్రమించేసి వ్యాపారం చేయడంపై గగ్గోలు రేగుతోంది. విలుకానిపల్లికి చెందిన ఒక కుటుంబం దాదాపు 60 ఎకరాలు చెరువు స్థలాన్ని ఆక్రమించిపారేశారంటే ఎంతగా ఆక్రమణదారులు బరితెగించి వ్యవహరిస్తున్నారో అర్థమవుతుంది. ఈ చెరువును సంరక్షించేందుకు ఆనాడు సర్పంచ్‌గా వుండిన దివంగత చింతం వెంకురెడ్డి, కోడూరుకు చెందిన వేళ్లపాళెం మధుసూధనరెడ్డి ఎంతగానో కృషి చేశారు. టిడిపి హయాంలో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మంత్రిగా పని చేసిన సమయంలో నీటి పారుదలశాఖమంత్రిగా వుండిన కడియం శ్రీహరిని తీసుకవచ్చి చెరువు ఆధునీకరణకు ప్రయత్నించారు. ప్రస్తుత శాసన సభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి దీనిపై దృష్టి సారించినా కార్యరూపం దాల్చలేదు. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. రాజకీయ అండదండలు కల్గినవారు చెరువును ఆక్రమించడంతోపాటు చదును చేసి అమ్మేస్తున్నారు. స్థానిక రైతు అన్నదేవుల విజయమోహన్‌రెడ్డి మాత్రం ఒంటరిగా ఆక్రమణలపై న్యాయస్థానంలో పోరాడుతున్నాడు. ఇటీవల రెవెన్యూ సదస్సులు జరిపినప్పుడు జిల్లాకలెక్టర్ దృష్టికి చెరువు ఆక్రమణలను తీసుకొనివచ్చారు స్థానికులు. అధికారులు పట్టించుకోకపోతే ఆక్రమణదారులు ఏకంగా పట్టాలు డిమాండ్ చేసినా ఆశ్చర్యం లేదని స్థానికులు వ్యాఖ్యానిస్తున్నారు.



నెల్లూరు జాఫర్ సాహెబ్ కాలువ గట్టుపై ప్రజాదీవెనలో భాగంగా ప్రజల సమస్యలు అడిగి తెలుసుకొంటున్న వైకాపా సిటీ సమన్వయకర్త పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్.



## పరసా వైఖరి పట్ల తెలుగుతమ్ముళ్ల ఆగ్రహం!

**కాంగ్రెస్ నాయకులను తెగపొగుడుతున్న ఎమ్మెల్యే!**

సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసా రత్నం వ్యవహారశైలిపై తెలుగుదేశంపార్టీ కార్యకర్తల్లో ఆగ్రహం వ్యక్తమవుతోంది. ఇందుకు కారణం ఇటీవల కొంతకాలంగా ఎమ్మెల్యే ప్రభుత్వ కార్యక్రమాల్లో పాల్గొనడంతోపాటు, ప్రతిపక్ష పార్టీలను, నేతలను కీర్తిస్తూ చేస్తున్న ప్రసంగాలే. ఇటీవల ముఖ్యమంత్రి సూళ్లూరుపేటకు వచ్చినపుడు కాంగ్రెస్ ఎమ్మెల్యేలు, పిసిసి ఛీఫ్ హాజరైన కార్యక్రమానికి స్థానిక శాసనసభ్యుడిగా పరసారత్నం హాజరయ్యారు. అంతవరకు బాగానే వున్నా పరసా తన ప్రసంగంలో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని ప్రశంసిస్తూ మాట్లాడడంపై తెలుగుదేశంపార్టీ కార్యకర్తలు తీవ్రంగా స్పందిస్తున్నారు. అలాగే అదే సభలో పాల్గొన్న పిసిసి అధ్యక్షుడు బొత్స సత్యనారాయణ ఎస్సీ, ఎస్టీ సబ్‌ప్లాన్ చట్టబద్ధతకు తెలుగుదేశంపార్టీ అడ్డుపడుతోందని విమర్శించినా, టిడిపి అధినేత చంద్ర బాబునాయుడిపై ఆరోపణలు చేసినా వేదికపైనే వుండిన పరసా వీటిని ఖండించకపోవడంపై సర్వత్రా విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. కొందరు కార్యకర్తలు పరసా హాజరైన కార్యక్రమంలో బహిరంగంగానే దీనిపై నిలదీస్తున్నారు. దీనికి ఆయన ఏమి సమాధానం చెప్తారో?

# కావలిలో చైన్ స్నాచింగ్ ముఠా!

**హడలిపోతున్న మహిళలు**

కావలి పట్టణంలో చైన్ స్నాచింగ్‌లు అధికం కావడంతో మహిళలు ఒంటరిగా బయటకు వెళ్లాలంటేనే హడలిపోతున్నారు. ఇలాంటి ఘటనలు రోజు ఏదో ఒక ప్రాంతంలో జరుగుతుండడంతో ప్రజలు ఒక విధమైన భయందోళనలు వ్యక్తం చేస్తున్నారు. పగలు, రాత్రి అనే తేడా లేకుండా దొంగలు పెట్రేగిపోయి ద్విచక్ర వాహనాలపై సంచరిస్తూ మహిళల మెడల్లో సరుడు, ఆభరణాలు దోచుకొని పోతుండడంతో పట్టణంలో తిరగాలంటేనే భయభ్రాంతులకు గురౌతున్నారు ప్రజలు. ఇటీవల జనతాపేటలో ఒంటరిగా వెళ్తున్న జిల్లాపరిషత్ పాఠశాలలో పని చేసే పద్మజ అనే టీచర్ మెడలో సరుడు ఇలాగే దొంగలు లాక్కెళ్లారు. అందరు చూస్తుండగానే ఈ ఘటన జరిగింది. ఇలాంటివి ఇటీవల తరచూ చోటు చేసుకొంటున్నా పోలీసులు సరిగా స్పందించడం లేదన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. దీనికితోడు మహిళలపై వేధింపులు పెరిగిపోతున్నాయి. ఇప్పటికైనా పోలీసులు కరకుగా డ్యూటీ చేసి చైన్‌స్నాచర్‌ల భరతం పట్టాలని పట్టణ ప్రజలు కోరుకొంటున్నారు.

# అల్లూరు - జువ్వలదిన్నె రోడ్డు ధ్వంసం!

**ఇక్కట్లు పడుతున్న ప్రజలు**

అల్లూరు నుంచి జువ్వలదిన్నెకుపోయ్యే రోడ్డు పూర్తిగా ధ్వంసమైపోయింది. ఉడ్‌హౌస్‌పేట మీదుగా వెళ్లే ఈ రహదారి గుంటలు మిట్టలుగా వుండడంతో ఈ మార్గం గుండా రాకపోకలు సాగించేవాళ్లు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఆరుకిలోమీటర్లకు పైగా పూర్తిగా ధ్వంసమైపోవడంతో వాహనాలపై వెళ్లే వారికి నరకం కనిపిస్తోంది. వాహనాలు పట్టుతప్పి తరచూ ప్రమాదాలకు గురౌతున్నారు ప్రయాణీకులు. గత ఏడాది వేసిన ఈ రోడ్డు కొద్దికాలానికే రూపురేఖలు కోల్పోయింది. అడుగులోతు గుంటలు పడి ఎగుడు దిగుడుగా మారడంతో దారుణంగా తయారైంది ఈ రోడ్డు. అసలే సింగిల్ రోడ్డు కావడంతో ఎదురెదురుగా వాహనాలు వస్తే మరింత ఆటంకం ఏర్పడుతోంది. ఈ పరిస్థితుల్లో రోడ్డు దెబ్బతినడంతో మరింత గందరగోళంగా మారింది పరిస్థితి. వర్షాకాలంలో ఈ ప్రాంత ప్రజలు ఈ మార్గంలో ప్రయాణించాలంటే అవస్థలు పడుతున్నారు. ఇప్పుడు బస్సులతోపాటు ధాన్యం కొనుగోలు సీజన్ కావడంతో అధికసంఖ్యలో లారీలు తిరుగుతుండడంతో మరింతగా దెబ్బతినిపోతోంది రోడ్డు. ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ఈ రోడ్డుపై ప్రయాణం చేస్తున్నారు. ఈ మార్గంలో రెండు వరద కాలువలున్నాయి. రోడ్డును మరమ్మత్తులు చేయించడంతోపాటు ఈ కాలువల వద్ద బ్రిడ్జీలు నిర్మించాలని ప్రజలు కోరుకుంటున్నారు.



# వరిగొండలో అయ్యోర్ల కుమ్ములాట!

**హెడ్మాస్టర్ X ఉపాధ్యాయులు**

ఉపాధ్యాయుల మధ్య తలెత్తిన వర్గపోరు పాఠశాలను భ్రష్టుపట్టిస్తున్న వైనం వరిగొండలో చోటు చేసుకొంది. తోటపల్లిగూడూరు మండల పరిధిలోని వరిగొండ ఉన్నతపాఠశాలలో ప్రధానోపాధ్యాయుడికి, ఇద్దరు ఉపాధ్యాయులకు నడుమ గత కొంతకాలంగా వైరం నడుస్తోంది. ప్రధానోపాధ్యాయుడికి సిబ్బందిపై అజమాయిషి లేకపోవడం, ఎవరికి వారే అన్న తీరుగా వ్యవహరిస్తుండడంతో పాఠశాల గాడి తప్పింది. ఈ ప్రభావం విద్యాబోధనపైన పడుతోంది. గ్రామ రాజకీయాలతో పోటీపడుతూ అయ్యోర్లు గ్రూపు రాజకీయాలు నడుపుతున్నారు. పదవతరగతి ఫలితాల్లోను ఉత్తీర్ణత అంతంత మాత్రంగానే వుంది. ఈ పరిస్థితుల్లో విద్యాబోధనపై దృష్టి సారించాల్సిన ఉపాధ్యాయులు గ్రూపులు కట్టడంపై శ్రద్ధ చూపుతుండడంతో పాఠశాల భ్రష్టుపట్టిపోయింది. విద్యార్థులను ఉపాధ్యాయులు వర్గాలుగా విడగొట్టారట. ఇటీవల ఎనిమిదోతరగతి చదువుతున్న అమ్మాయిని అదే పాఠశాలకు చెందిన విద్యార్థులు అల్లరి చేశారట. ఈ విషయాన్ని ఆమె తల్లిదండ్రులకు తెలపడంతో వారు పోకిరీలను మందలించారట. దీంతో ఆగ్రహించిన విద్యార్థులు పొలం పనులు చేసుకొంటున్న బాలిక తల్లిదండ్రులపై దాడి చేయడం, అది కాస్త పోలీస్‌స్టేషన్ వరకు వెళ్లడం జరిగాయి. దీనికి కారణం పాఠశాల ఉపాధ్యాయులేనని, వారి ప్రవర్తన కారణంగానే పిల్లలు దాడులకు దిగుతున్నారని గ్రామస్తులు ఆరోపిస్తున్నారు. దీనిపై విద్యాశాఖ అధికారులకు ఫిర్యాదు చేశారు. అధికారులు గాడి తప్పిన ఉపాధ్యాయులను ఎలా చక్కదిద్దుతారో చూడాలి.

# విద్యార్థులను పాఠశాలకు రప్పించాలి!

పాఠశాలలు మూతపడకుండా వుండాలన్నా, ఎత్తివేయకుండా చూడాలన్నా విద్యార్థుల సంఖ్య ముఖ్యమని, దీనిని దృష్టిలో వుంచుకొని ఉపాధ్యాయులు బాధ్యతాయుతంగా వ్యవహరించాలని గూడూరు సబ్‌కలెక్టర్ నివాస్ హెచ్చరించారు. వెంకటగిరిలో పర్యటించిన ఆయన అభ్యుదయ పాఠశాలలను తనిఖీ చేశారు. ఈ సందర్భంగా విద్యా బోధనను, విద్యార్థుల హాజరు శాతాన్ని పరిశీలించారు. విద్యార్థుల సంఖ్యను పెంచాల్సిన బాధ్యత ఉపాధ్యాయులపై వుందన్నారు. లేదంటే పాఠశాలలు మూతపడుతున్నాయని ఈ సంగతిని గుర్తించి జాగ్రత్తగా వ్యవహరించాలన్నారు. అనంతరం విద్యార్థులతో ముచ్చటించిన ఆయన మధ్యాహ్న భోజనం ఎలా పెడుతున్నారు, నాణ్యతగా వుంటుందా, మెనూ ప్రకారం పెడుతున్నారా అని ప్రశ్నించి సమాధానాలు రాబట్టారు. సెలవుల్లో ఏమి చేస్తారని అడగ్గా ఆడుకుంటామని విద్యార్థులు సమాధానమిచ్చారు. కష్టపడి చదువుకొని ఉన్నత శిఖరాలను అధిరోహించాలని సబ్‌కలెక్టర్ విద్యార్థులకు సలహా ఇచ్చారు.

# ప్రభుత్వ బడుల్లో తగ్గుతున్న విద్యార్థులు!

## • వెంకటగిరిలో ఇదీ పరిస్థితి

వెంకటగిరి ప్రాంతంలో గల ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య గణనీయంగా పడిపోతోంది. ఒకనాడు ఒక వెలుగు వెలిగిన ప్రాథమిక పాఠశాలలు నేడు విద్యార్థులు లేక వెలవెలపోతున్నాయి. ప్రభుత్వం ప్రాథమిక విద్యాభివృద్ధికి ఎంతో కృషి చేస్తున్నామని చెప్తున్నా ఆచరణలో అవి అమలు కాకపోవడంతో ప్రాథమిక పాఠశాలలకు ఈ పరిస్థితి దాపురించిందని పలువురు విమర్శిస్తున్నారు. ఒకనాడు వందలమంది విద్యార్థులకు చదువు చెప్పిన పాఠశాలలు, ఎంతో పేరు ప్రఖ్యాతులు గల పాఠశాల పరిస్థితి దయనీయంగా మారింది. వెంకటగిరి కాశీపేటలోగల పుల్లయ్యబడి, పాతకోట పాఠశాల, కాంపాళెం ప్రాథమిక పాఠశాల, రాణిపేట, బంగారుపేటలోగల ప్రాథమిక పాఠశాలలు పదులసంఖ్యలో విద్యార్థులతో కళావిహీనంగా మారాయి. ఆంగ్లమాధ్యమంపై వున్న మోజు, ప్రభుత్వ పాఠశాలల్లో చదువు సరిగా వుండదన్న అపోహ, కొందరు ఉపాధ్యాయుల నడవడికతో ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలను చేర్పించేందుకు ఎవరు మొగ్గు చూపడం లేదు. ఎన్ని కష్టాలైన పడి కాన్వెంట్ స్కూల్లో పిల్లలను చదివించాలని తల్లిదండ్రులు భావిస్తుండడం, ఇతరత్రా కారణాల ప్రాథమిక పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిపోవడానికి కారణంగా మారుతున్నాయి. మధ్యాహ్న భోజన పథకం, ఇతరత్రా కార్యక్రమాలు ఎన్ని నిర్వహించినా అధికారుల్లో, ఉపాధ్యాయుల్లో చిత్తశుద్ధి కొరవడడంతో ప్రాథమిక పాఠశాలలు నిర్వీర్యం అవుతున్నాయి.



కొత్తూరు సమీపంలోని ప్రగతి చారిటీస్‌లో నార్తుమోపూరువాసి కాకాణి పాండురంగారెడ్డి దాతృత్వంలో కట్టిన తరగతి గదులను ప్రారంభిస్తున్న ఎస్పీ బి.వి.రమణకుమార్.

## • కావలిలో

# సవాలక్ష సమస్యలు!

### పరిష్కారం కోసం ఎదురు చూస్తున్న ప్రజలు

కావలి నియోజకవర్గంలో వివిధ సమస్యలకు పరిష్కారం ఎప్పుడు లభిస్తుందో అని ప్రజలు ఎదురు చూడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. ఇందిరమ్మ ఇళ్ల కోసం పేద ప్రజలు, త్రాగునీటి కోసం సామాన్య, మధ్యతరగతి ప్రజలు, సాగునీటి కోసం రైతాంగం చాలాకాలంగా ఎదురుచూడాల్సిన పరిస్థితులు నెలకొంటున్నాయి. వీటికి పరిష్కారం ఎప్పుడెప్పుడు అధికారులు, ప్రజాప్రతినిధులు చూపెడతారా అని ప్రజలు కళ్లు కాయలు కాచేలా ఎదురుచూడాల్సి వస్తుండడంతో ప్రజల్లో ఒక రకమైన నిరాశ ఏర్పడుతోంది. పట్టణంలో అండర్ గ్రౌండ్ డ్రైనేజీ కలగానే మిగిలింది. కావలి చెరువుకు చుక్క నీరు అందడం లేదు. రూరల్ మండలం కొండెపి డ్రైన్ సమస్య ఏళ్ల తరబడి అలాగే వుంది. బకింగ్ హామ్ కెనాల్ వంతెన, కావలి–బోగోలు మండలాలను కలుపుతూ అన్నగారిపాళెం– జువ్వలదిన్నె మధ్య చిప్పలేరుపై వంతెన, అల్లూరు మండలంలో సమ్మర్‌స్టోరేజ్ ట్యాంక్ నిర్మాణం, రామన్న చెరువు వద్ద వంతెన సమస్యలు నేటికి పరిష్కారానికి నోచుకోలేదు. జువ్వలదిన్నెను పర్యాటక కేంద్రంగా మార్చే ప్రక్రియ ప్రారంభానికి నోచుకోలేదు. అలాగే డిఎంఛానల్, కావలి కాలువ ఆధునీకరణ పనులు ప్రతిపాదనలకే పరిమితం అయ్యాయి. ఈ సమస్యలు ఎప్పుడు పరిష్కారిస్తారో, ఎప్పుడు అభివృద్ధి జరుగుతుందోనని నియోజకవర్గ ప్రజలు ఆశగా ఎదురు చూస్తున్నారు.

# ఎస్సీ, ఎస్టీ సబ్‌ప్లాన్ వైఎస్ కల!



### కోవూరు ఎమ్మెల్యే ప్రసన్న

దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కలల రూపమే ఎస్సీ, ఎస్టీ సబ్‌ప్లాన్ అని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తెలిపారు. ఎస్సీ, ఎస్టీల అభివృద్ధి కోసం నిరంతరం వైఎస్ తపించారన్నారు. రెండుసార్లు కాంగ్రెస్ పార్టీని అధికారంలోకి తెచ్చిన వైఎస్‌ఫోటో లేకుండా సబ్‌ప్లాన్ నిర్వహించడం దారుణమన్నారు. ప్రభుత్వం గొప్పలు చెప్పుకొంటున్న సబ్‌ప్లాన్ ఆచరణలో సక్రమంగా జరగడంలేదని విమర్శించారు. బుచ్చిరెడ్డిపాళెం మండలం రేబాల దళితవాడలో పర్యటించిన ఆయన సబ్‌ప్లాన్‌పై పై విధంగా వ్యాఖ్యానించారు. పలు దళితవాడల్లో మౌలిక వసతులు లేవన్నారు. రోడ్డు సక్రమంగా లేక, మంచినీటి వసతి లేక ఆ ప్రాంత ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారన్నారు. ఎస్సీ, ఎస్టీలకు వచ్చే నిధులను ఆయా కాలనీల అభివృద్ధికే వినియోగించాలని డిమాండ్ చేశారు.

# సిలికా అక్రమ రవాణా!

### పట్టించుకోని రెవిన్యూ, మైనింగ్ శాఖలు

అధికారులు ఎన్ని హెచ్చరికలు చేస్తున్నా ఇసుక అక్రమ రవాణా ఆగడం లేదు. చిల్లకూరు మండలం నుంచి తమిళనాడుకు ఈ అక్రమ రవాణా యదేచ్ఛగా సాగుతోంది. సిలికా గనులలో లభించే ఇసుకను ఇక్కడి నుంచి తమిళనాడు, హైదరాబాద్‌లకు విచ్చలవిడిగా రవాణా చేస్తూ అక్రమార్కులు లక్షల రూపాయలు ఆర్జిస్తున్నారు. రెవెన్యూ, మైనింగ్ శాఖలు ఈ ఇసుక అక్రమరవాణాకు అడ్డుకట్ట వేసేందుకు కొన్ని షరతులతో కూడిన పర్మిట్లను ఇచ్చాయి. దీని ప్రకారం సిలికా గనుల యాజమాన్యాలు వివిధ రాష్ట్రాలలో ఆర్డర్లు వున్న కర్మాగాలకు మాత్రమే సిలికా రవాణా చేయాలి. కాని ఈ నిబంధనలకు పాటించకుండా అక్రమ వ్యాపారానికి తెరలేపడంతో సిలికా గనుల నుంచి ఇసుక అక్రమంగా తరలిపోతోంది. తమిళనాడుకు చెందిన కొందరు వ్యాపారస్తులతో చేయి కలిపిన సిలికా గనుల యాజమాన్యాలు గుట్టుచప్పుడు కాకుండా ఈ తతంగాన్ని నడిపిస్తున్నారు. దీనికి కొందరు రెవెన్యూ, మైనింగ్ శాఖల సిబ్బంది అండదండలు అందిస్తున్నారనే ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. దీనిపై సంబంధిత గనుల యాజమాన్యాలను ప్రశ్నిస్తే మాకు అవేమి తెలియదు, లారీల వాళ్లు వచ్చి డబ్బు కట్టారు. ఆ డబ్బుకు సరిపడే ఇసుక నింపి పంపిస్తున్నామని సమాధానమిస్తున్నారు. ఎలాంటి అనుమతి ప్రతాలు లేకుండా వాహనాలు తిరుగుతున్నా సంబంధిత అధికారులు పట్టించుకోకపోవడంతో ఇటీవల గ్రామస్తులే దాదాపు 12 వాహనాలను నిలిపి వేసి రెవెన్యూ అధికారులకు సమాచారం అందించారు. ఇలాంటి వాటిపై ఆయా శాఖలు కఠిన చర్యలు చేపట్టి అక్రమ రవాణాకు అడ్డుకట్ట వేయాలని పలు గ్రామాల ప్రజలు కోరుకొంటున్నారు.

# నష్టాల్లో నెల్లూరు ఆర్టీసి!

### ఎందుకిలా?

ఆర్టీసి 22కోట్ల రూపాయల నష్టంతో నడుస్తోందని రీజినల్ మేనేజర్ చింతా రవికుమార్ తెలిపారు. ఇటీవల ఆయన కోట ఆర్టీసి బస్టాండును ఆకస్మిక తనిఖీ జరిపారు. వివిధ విభాగాల పనితీరును పరిశీలించిన ఆయన సిబ్బందికి పలు సూచనలు చేశారు. అనంతరం ఆర్టీసి సంస్థ నష్టాల్లో నడుస్తున్నదని వివరించారు. దీనిని లాభాల బాట పట్టించడానికి ప్రజలు సహకారం అందించాలని కోరారు. ప్రయాణానికి ప్రజలు ఆర్టీసి బస్సులనే వినియోగించాలన్నారు. ప్రైవేట్ వాహనాలలో ప్రయాణించి ప్రమాదాలు కొనితెచ్చుకోవద్దని సూచించారు. రవాణా సౌకర్యాన్ని విస్తృత పరచేందుకు త్వరలో 50కొత్త బస్సులను ప్రవేశపెడుతున్నట్లు తెలిపారు. వాకాడు డిపో నుంచి ప్రతి అరగంటకు కోట మీదుగా గూడూరు పాత బస్టాండ్ వరకు పల్లె వెలుగు బస్సులను నడుపుతున్నామన్నారు. ప్రయాణీకుల పట్ల సిబ్బంది గౌరవంగా మెలగాలన్నారు.



# శుభకార్యాల మాసం వైశాఖం!

కొండలు పగిలే ఎండాకాలంలో వచ్చే మాసం వైశాఖం. ఈ మాసం వస్తూ వస్తూ వ్రతాలు, పెళ్లిళ్ల ఇతర శుభకార్యాలను తీసుకవస్తుంది. అందుకే వైశాఖ మాసం అంటే వివాహాది శుభకార్యాలకై ఎదురు చూసే వారందరికి ఎంతో ఇష్టమైన మాసం. సాక్షాత్తూ శ్రీమహావిష్ణువుకు ఎంతో ప్రీతికరమైన మాసం. ఏడాది కాలంలో వచ్చే వివిధ మాసాలలో నాలుగు మాసాలు పుణ్యప్రదమైనవి, శుభప్రదమైనవిగా చెబుతారు. అవి కార్తీక, మాఘ, మార్గశిర, వైశాఖ మాసాలు. పురాణాలలోను వైశాఖ మాసం యొక్క గొప్పదనం గురించి వివరించబడి వుంది. యుగాలన్నింటిలోను కృతయుగం, తీర్థాలన్నింటిలోను గంగాజలం, దానాలన్నింటిలోను జలదానం, మాసాలన్నింటిలోనూ వైశాఖ మాసం ఉత్తమోత్తమమైనవని పురాణాలు పేర్కొంటున్నాయి.

అంతటి ప్రాశస్త్యంగల వైశాఖ మాసంలో చేసే దానాలు, వాటి వలన కలిగే పుణ్యాలు గురించి వివరించబడి వున్నాయి పురాణాలలో. అసలు దానం చేయడం అంటేనే పుణ్యం. అలాంటి వాటిలో జల దానం చేయడం ఎంతో శ్రేయస్కరం, పుణ్యప్రదమంటారు. స్కాందపురాణంలో దీనిని గురించి వివరించబడి వుంది. వేసవిలో, మండుతున్న ఎండలకు గొంతెండిపోతుంటుంది. అలాంటి సమయంలో జలాన్ని దానం చేయడం వలన కలిగే పుణ్యాల గురించి చెప్పేందుకు యుగాలు చాలవంటారు. అందుకే ఎండాకాలంలో చాలామంది చలివేంద్రాలు ఏర్పాటు చేస్తుంటారు. దప్పికతో వుండే వారికి కాసింత మంచినీటిని ఉచితంగా అందిస్తే అవతలవారి దాహార్తి తీర్చిన వాళ్లం కావడంతోపాటు శ్రీహరి కృపాకటాక్షాలు లభిస్తాయి. ఇక అన్నదానం గొప్పదనాన్ని చెప్పేందుకు మాటలు చాలవు. ఈ సృష్టి మొత్తంలో మానవుడికి తృప్తి కల్గించేది అన్నదానం. ఇక చాలు అని నోరారా అన్పించగలిగే శక్తి ఒక్క అన్నానికి మాత్రమే వుంది. పరబ్రహ్మ స్వరూపంగా చెప్పబడే అన్నాన్ని ఆకలితో వున్న వాడికి పెట్టడం వల్ల దేవతలంతా దీవిస్తారంటారు. అభాగ్యులకు ఈ కాలంలో వస్త్రాలు దానం చేస్తే, సంపూర్ణ ఆయుర్దాయం పొందుతారని, దోషాలన్ని తొలగిపోతాయని చెప్తారు. సుఖమైన నిద్రకు ఉపక్రమించే మంచాన్ని ఈ కాలంలో దానం చేయడం వలన శుభం కల్గుతుందంటారు. అయితే ఏ దానం చేసినా, ఏ సహాయం చేసినా ఫలాపేక్ష లేకుండా చేసిన వాడికే సంపూర్ణ ఫలితం కల్గుతుందని గీతలో కృష్ణపరమాత్మ చెప్పినట్లు పరిశుద్ధ మనసుతో సహాయం చేసిన వారికి ఆపన్నులను ఆదుకొన్న వారికే దేవతలు ఆశీస్సులు లభిస్తాయి.




వేట

# పెద్ద తిమింగలాల కోసం ఏసిబి వేట మొదలు!

**ఏసిబి అధికారులు పెద్దస్థాయిలో పనిచేసే అధికారుల జోలికి వెళ్లకుండా క్రిందిస్థాయి అధికారులు, సిబ్బందిని లక్ష్యంగా చేసుకొని దాడులు చేస్తున్నారన్న విమర్శను రూపుమాపను వీరిపై కూడా ఆ శాఖ దృష్టి సారించినట్లు తెలిసింది.**

వివిధ ప్రభుత్వ శాఖల కార్యాలయాల్లో లంచాలు వసూలు చేస్తున్న పెద్ద తిమింగలాలను పట్టుకునేందుకు ఏసిబి అధికారులు వలపన్నారు. నాలుగు నెలల వ్యవధిలో తొమ్మిది మందిని లంచం తీసుకొంటుండగా పట్టుకున్నారు. జిల్లా ఖజానా కార్యాలయంలో వైద్య ఆరోగ్య శాఖ గుమస్తా నుంచి లంచం తీసుకుంటుండగా ముగ్గురిని, జిల్లా పరిశ్రమల కేంద్రంలో ఇద్దరిని, తాజాగా నగర పాలక సంస్థ కార్యాలయంలో బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్‌తోపాటు మరో ఇద్దరిని ఏసిబి అధికారులు వలపన్ని పట్టుకున్న సంగతి తెలిసిందే. అయితే ప్రతి ప్రభుత్వ శాఖ కార్యాలయంలో లంచం తీసుకుంటున్నవారున్నారు. కాని వీరందరు ఏసిబికి దొరకకుండా చాలా తెలివిగా తప్పించుకుంటున్నారు. ప్రజలకు జవాబుదారీతనంగా వ్యవహరించాల్సిన అధికారులు అధికార పార్టీ నేతల అండదండలు చూసుకొని మరింత రెచ్చిపోతున్నారు.

ప్రధానంగా వాణిజ్య పన్నుల శాఖ, రవాణాశాఖ, ఎక్సైజ్, ట్రెజరీ, రిజిస్ట్రేషన్, ఐసిడిఎస్ శాఖల్లో ఏ పని కావాలన్నా చేతులు తడపందే పనులు జరగని పరిస్థితి నెలకొని ఉంది. నగరపాలక సంస్థ కార్యాలయంలో బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్లు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నారు. కార్పొరేషన్ పరిధిలో భవనాలు, అపార్టుమెంట్లు, షాపింగ్ కాంప్లెక్స్‌ల నిర్మాణాలకు సిటీ ప్లానింగ్ విభాగం నుంచి ముందుగా అనుమతి పొందాలి. ప్లాన్ అప్రూవల్ చేసే ముందు నిబంధనలు విధించి ఆ విధంగా నిర్మాణాలు చేపట్టాలని సూచిస్తారు. భవనం పూర్తి చేసిన సమయంలో బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్లు రంగ ప్రవేశం చేసి లక్షల్లో లంచం డిమాండ్ చేస్తుంటారు. కోట్ల రూపాయలు వెచ్చించి అపార్టుమెంట్లు నిర్మించినవారు ఎంతో కొంత ముట్ట చెప్పడం ఆనవాయితీ. సిటీ ప్లానింగ్ విభాగంను పర్యవేక్షించే అధికారికి కూడా ఇందులో వాటా అందుతుందన్న ప్రచారం వుంది.

ఇటీవల కాలంలో ఏసిబి అధికారులు లంచాలు డిమాండ్ చేస్తున్న శాఖలపై ప్రధానంగా దృష్టి సారించారు. లంచం డిమాండ్ చేయడం, ఆదాయానికి మించి ఆస్తులు కలిగి వుండడం చట్టవిరుద్ధం. ఈ విషయం అందరికీ తెలిసినప్పటికీ ఎవరూ పాటించని పరిస్థితి. వివిధ పనుల నిమిత్తం ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్లిన వారు సైతం ఎంతో కొంత గుమస్తాకు ముట్టచెప్పి పని చేయించుకుని వెళ్తుంటారు. ఏసిబి అధికారులకు ఫిర్యాదులు చేసేవారు చాలా అరుదు. ఆధారాలతో సహా ఫిర్యాదులు చేస్తే కఠిన చర్యలు తీసుకుంటామని, ఫిర్యాదుదారుల వివరాలు గోప్యంగా వుంచుతామని డిఎస్పీ చెబుతున్నా ముందుకు రావడం లేదు. నగర పాలక సంస్థ కార్యాలయంపై ఏసిబి దాడులు జరిగిన నేపథ్యంలో అన్ని శాఖల అధికారులు, సిబ్బంది అప్రమత్తంగా వుంటూ విధులు నిర్వహిస్తున్నారు. అనుమానాస్పదంగా వున్నవారి నుంచి లంచం డిమాండ్ చేయకుండా, కార్యాలయం చుట్టూ తిప్పుకుంటున్నారు.

ఏసిబి అధికారులు పెద్ద స్థాయి అధికారుల జోలికి వెళ్లకుండా క్రింది స్థాయి అధికారులు, సిబ్బందిని లక్ష్యంగా చేసుకొని దాడులు చేస్తున్నారన్న ఒక ప్రచారం వుంది. లంచం తీసుకొనే వారు ఎంతటి స్థాయి అధికారినైనా పట్టుకునే అధికారం ఏసిబికి వుంది. ఉన్నతాధికారులు లంచం తీసుకొనే విషయంలో చాలా తెలివిగా వ్యవహరిస్తూ పట్టుపడకుండా తప్పించుకుంటున్నారు. ప్రతి కార్యాలయంపై ఏసిబి నిఘా పెట్టింది. కార్యాలయాల్లో జరుగుతున్న లావాదేవీలపై కూడా దృష్టి సారించినట్లు సమాచారం. వైద్య ఆరోగ్యశాఖ కార్యాలయంలో డిప్యుటేషన్ల పేరుతో వైద్యులు, సిబ్బందిని వేరే ప్రాంతాల్లో నియమించేందుకు ముక్కుపిండి వసూలు చేస్తున్నారు. ఈ కార్యాలయంపై కూడా నిఘా వుంచినట్లు తెలిసింది. ఇదిలా వుండగా జిల్లా పరిపాలనలో రెవిన్యూ, పౌరసరఫరాల శాఖలను పర్యవేక్షించే ఉన్నతస్థాయి అధికారి తన దగ్గరకు వచ్చే వారి నుంచి అవసరాన్ని బట్టి లంచం డిమాండ్ చేస్తున్నారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి.

రాజకీయ సిఫార్సులతో సమస్యను పరిష్కరించాలని వచ్చేవారిని తనకు కమీషన్ కొంత మొత్తం ఇవ్వాలని అడుగుతున్నారని బయట గుసగుసలు వినిపిస్తున్నాయి. ఉన్నత స్థాయి అధికారే స్వయంగా కమీషన్ అడగడంతో బాధితులు ఆశ్చర్యపోతున్నారు. ఇటువంటి అధికారికి అవినీతిపరులైన అధికారులపై ఫిర్యాదు చేస్తే ఎటువంటి చర్యలు తీసుకొంటారో అర్థం చేసుకోవచ్చు. అవినీతి నిరోధక శాఖ అధికారులు ఈ స్థాయి అధికారులను పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నా సహకరించేవారు కరువయ్యారు. మొత్తం మీద జిల్లా పరిపాలన ముందుకు సాగడం లేదన్నది నగ్న సత్యం. ఏసిబి దాడుల నేపథ్యంలో కొద్ది రోజుల పాటు లంచాలకు దూరంగా వుండాలన్న ఆలోచనలో ఉద్యోగులున్నారు.

J

## చేపల వేట నిషిద్ధం...

# మత్స్యకారులకు పూట గడిచేదెట్లా?

జిల్లాలో ఏప్రెల్ 5 నుంచి మే నెల వరకు దాదాపు 55 రోజులపాటు సముద్రంలో చేపల వేటపై ప్రభుత్వం నిషేధించింది. ఈ రెండు నెలల వ్యవధిలో సముద్రంలో చేపల సంతానోత్పత్తి జరిగే అవకాశం వుంది. ఈ సమయంలో మత్స్యకారులు చేపలవేట సాగిస్తే చేపల సంతానోత్పత్తికి తీవ్ర ఇబ్బంది ఏర్పడే ప్రమాదం వుంటుందని అధికారులు చెబుతున్నారు. చేపల వేటపైనే ఆధారపడి జీవించే వేలాది మంది జాలర్లు జీవనాధారం లేక ఇళ్ల వద్దనే వుంటున్నారు. ఇతరుల మాదిరిగా వీరు ఇతర కూలీ పనులకు వెళ్లరు. అనేక సంవత్సరాల నుంచి కుటుంబ వారసత్వంగా చేపల వేటనే కొనసాగిస్తూ వస్తున్నారు.

కావలి మండలం నుంచి తడ వరకు 9 మండలాలకు చెందిన మత్స్యకారులు జీవనోపాధి కోసం ఎదురు చూస్తున్నారు. రాష్ట్రప్రభుత్వం తీర ప్రాంతంలో ఏ ఒక్కరూ కూడా సముద్రంలోకి వెళ్లి చేపల వేటకు వెళ్లరాదని ఆదేశాలు జారీ చేయడంతో మత్స్యశాఖ అధికారులు అప్రమత్తమై నిషేధం ప్రకటించారు. 55 రోజులపాటు కుటుంబ పోషణ కోసం మత్స్యశాఖ ప్రతి కుటుంబానికి 30 కిలోల బియ్యం సరఫరా చేయాలి. గతంలో కూడా నిషేధం విధించినప్పుడు 30కిలోల బియ్యం, రేషన్‌షాపుల నుండి ఇతర సరుకులు డీజిల్‌పై అందించే 30శాతం సబ్సిడీని నిషేధ సమయంలో అందిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. కాని ప్రభుత్వం చేసిన ప్రకటన కేవలం కాగితాలకు పరిమితమై పోయింది.

ప్రభుత్వ వైఖరిపై మత్స్యకారుల సంఘాలు పలు దఫాలు ఆందోళన చేసిన ఫలితంగా కొన్ని నెలల తర్వాత బియ్యం, డీజిల్‌పై అందించే సబ్సిడీని మంజూరు చేయడం జరిగింది. ఈ సంవత్సరం చేపల వేటపై నిషేధం విధించి నెలరోజుల కావస్తున్నా కుటుంబానికి అందించే 30 కిలోల బియ్యం, ఇతర సరుకులు పంపిణీ జరగలేదు. తీర ప్రాంతాలలోని మత్స్యకారుల కుటుంబాలకు చెందిన మహిళలు పట్టణ ప్రాంతాలలో భవన నిర్మాణ పనులకు వెళ్లి కుటుంబాన్ని పోషించాల్సిన పరిస్థితి ఏర్పడింది. వేసవి కాలం కావడం, ఈ దఫా రెండవ పంట కూడా లేకపోవడం వలన గ్రామీణ ప్రాంతాల్లో కూలీ పనులు వుండడం లేదు. జాతీయ గ్రామీణ ఉపాధిహామీ పథకం క్రింద మత్స్యకారులకు పనులు కల్పించడం లేదు. వలసలను నియంత్రించడం తోపాటు, జీవనోపాధి కల్పించాలన్న లక్ష్యంతో ప్రవేశపెట్టిన ఈ పథకం మత్స్యకారులకు మాత్రం వర్తింప చేయడం లేదు.



ఇంటర్ ద్వితీయ సంవత్సరం ఫలితాల్లో బైపిసి విభాగంలో 988 మార్కులు సాధించి రాష్ట్రస్థాయిలో ద్వితీయ స్థానంలో నిలచిన అమ్మనబ్రోలు శ్రావ్యను అభినందిస్తున్న విశ్వసాయి జూనియర్ కళాశాల నిర్వాహకులు డాక్టర్ సత్యనారాయణ, జి.కృష్ణమోహన్. ఫోటోలో ఇంటర్ ర్యాంకర్లు నివాళిక, గౌతమ్‌సాగర్‌రెడ్డి, ఆర్‌ఎస్.నిషాంత్ కూడా వున్నారు.

### ప్రభుత్వం ఆదుకోవాలి



సముద్రంలో చేపల వేటపై నిషేధం విధించిన ప్రభుత్వం మత్స్యకారులను ఆదుకోవాలి. దాదాపు 55 రోజుల పాటు నిషేధం అమల్లో వుంటుంది. సముద్రంలో చేపల సంతానోత్పత్తి ఈ కాలంలో జరిగే అవకాశం వుంది. ఇందుకు మత్స్యకారులు కూడా పూర్తి సహకరిస్తున్నారు. కాని ప్రభుత్వం వైపు నుంచి మాత్రం ఎటువంటి సహకారం అందడం లేదు. నిషేధ సమయంలో ప్రభుత్వం ప్రకటించిన విధంగా 30కిలోల బియ్యం, డీజిల్ వినియోగంపై ఇచ్చే సబ్సిడీని అందించడం లేదు. సంబంధితశాఖ అధికారులను కలసి విన్నవించుకున్నా ఫలితం వుండడం లేదు.

– పరదేశి రఘురామయ్య
వైఎస్సార్‌సిపి జిల్లా మత్స్యకారుల సెల్ అధ్యక్షుడు

# వారఫలాలు

*తేది 4-5-2013 నుండి 10-5-2013 వరకు మేషంలో రవి, కుజ, బుధ, కేతువులు, 4వ తేదీ వరకు శుక్రుడు తదుపరి వృషభంలో గురువుతో యుతి; తులలో శని, రాహువులు; మకర, కుంభ, మీన, మేషాలలో చంద్రుడు సంచరిస్తారు.*




గ్రహస్థితులు గతవారం వలె వుండడం వల్ల చేపట్టిన పనులు నిదానంగా జరుగుతాయి. వృత్తి, వ్యాపారాలకు మిశ్రమ ఫలితాలు, విద్యార్థులకు అధిక శ్రమానంతరం ఫలితం. వ్యవసాయదారులకు సామాన్య ఫలితాలు. కళా, క్రీడా రంగాల వారికి నూతన పరిచయాల వల్ల నూతన కాంట్రాక్ట్‌లు లభిస్తాయి. ఇతరులతో అగ్రిమెంట్లు కుదుర్చుకొనేటప్పుడు జాగ్రత్తలు పాటించాలి.




వృత్తి, వ్యాపారాలలోని వారికి తమ భాగస్వాములతో సమన్వయం, స్థిరాదాయం వుంటాయి. కుటుంబ నిర్వహణకు రుణాలు చేయవలసి వస్తుంది. ప్రయాణాలలో తరచూ ఆటంకాలు. అలసట, నిస్సత్తువ. విద్యార్థులకు భవిష్యత్తు గురించి ఆలోచనలు. వ్యవసాయదారులకు ఆర్థికాభివృద్ధి క్రమంగా పెరుగుతుంది. రాజకీయులు ప్రయత్నాలు సాగక నిరుత్సాహానికి గురౌతారు.




గ్రహబలం తగ్గుతుండడం వల్ల అన్నింటా సాధారణతలు కన్పిస్తున్నవి. శరీరారోగ్య విషయంలో జాగ్రత్తలు అవసరం. వృత్తి, వ్యాపారాలలో సామరస్య ధోరణి అవసరం. విద్యార్థులకు కార్యసిద్ధి. ఇంటా బయట ఖర్చులధికం. ఇతర వ్యవహారాలకు దూరంగా వుంటూ, స్వకార్యక్రమాలందు గట్టి ప్రయత్నాలు అవసరం. వ్యవసాయ, కళా, క్రీడాకారులు చేసే పనులలో పలు ఆటంకాలుంటాయి.




గతంలో వున్న స్వల్ప అనుకూలతలు, లాభస్థానమందు పంచగ్రహ కూటమిచే అన్నిటా శుభశకునాలు గోచరిస్తున్నాయి. అప్రయత్నపూర్వకంగా తలచిన పనులు నెరవేరుతాయి. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక లాభాలు క్రమంగా పెరుగుతాయి. సుఖశాంతులు పెరుగుతాయి. బంధుమిత్రులతో విందులు, వినోదాలలో పాల్గొంటారు. అనవసర విషయాలలో జోక్యం చేసుకోవద్దు.




గ్రహబలం మిశ్రమంగా వుండడం వల్ల తలపెట్టిన పనులు నిదానంగా లేదా అసంతృప్తిగాను పూర్తవుతాయి. కొంతమేర నిరాశ, నిస్పృహలుంటాయి. ఇంటాబయట ఖర్చులధికం. వృత్తి, వ్యాపారాలలోని వారికి సామాన్య ఆర్థికస్థితి. విద్యార్థులకు దీక్ష, పట్టుదల అవసరం. వ్యవసాయ, కళా, క్రీడా రంగాలలోని వారికి ద్రవ్యహాని, స్థానహాని, కష్టతర బాధ్యతలు మరియు మిశ్రమ ఫలితాలుంటాయి.




నూతన వ్యాపార ఆలోచనలు కలిసిరావు. ప్రతికూల ప్రాంతాలలో నివసించడం, కుటుంబ సహకారం, సంతాన విజయాలు ఆనందాన్నిస్తాయి. ఇతరులను విశ్వసించకండి. వ్యవసాయ, క్రీడలు, కళాకారులు రాబడి, పోబడిలలో మెలకువలు పాటించడం అవసరం. ముఖ్యంగా ఆరోగ్య లోపాలు బాధిస్తాయి. రాజకీయులు ఆచి, తూచి వ్యవహరించడం మేలు, దైవ కార్యాలలో పాల్గొనడం మంచిది.

## పంచాంగం

4తేది డొల్లు కర్తరి ప్రారంభం.
5తేది వరూధిని ఏకాదశి.
7తేది వరాహ జయంతి.

### శుభ ముహూర్తాలు

శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసన, అక్షర స్వీకార, కేశఖండనాదుల వంటి సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### మే తిథులు

చైత్ర బహుళ

| | | | | |
|---|---|---|---|---|
| 4 | శని | దశమి | రా 02.01 | గం.ల.వ |
| 5 | ఆది | ఏకాదశి | రా 01.51 | గం.ల.వ |
| 6 | సోమ | ద్వాదశి | రా 02.13 | గం.ల.వ |
| 7 | మంగళ | త్రయోదశి | రా 03.01 | గం.ల.వ |
| 8 | బుధ | చతుర్దశి | తె 04.16 | గం.ల.వ |
| 9 | గురు | అమావాస్య | పూర్తిగా | |
| 10 | శుక్ర | అమావాస్య | ఉ 05.56 | గం.ల.వ |

అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.




గ్రహ సంచారం ప్రతికూలంగా వుండడం వల్ల ప్రతి పని యందు శ్రద్ధ, పట్టుదల అవసరం. అది కూడా వ్యక్తిగత పర్యవేక్షణలో చేపట్టాలి. రుణ ప్రయత్నాలు దూరంగా వుండండి. కుటుంబ వ్యక్తుల మధ్య అభిప్రాయభేదాలు సమస్యాత్మకంగా వుంటాయి. వృత్తి, వ్యాపారాలు గతంలో కన్నా మేలుగా వుంటాయి. విద్యార్థులు తదుపరి విద్యలకై దూర ప్రయాణాలు మానుకోవడం మేలు.




గ్రహ సంచారంలోని మార్పుల వల్ల చేసే ప్రయత్నాలన్నీ ఆటంకాలతో సాగుతాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి వ్యాపారపరమైన ఇబ్బందులు, ఆదాయ వ్యయాలకు పొంతన లేకుండడం, విద్యార్థులకు గందరగోళం, అర్థంకాని పరిస్థితులు, అధిక శ్రమ అవసరమౌతుంది. వ్యవసాయదారులు సామాన్య ఫలితాలు ఆశించగలరు. కళా, క్రీడలలోని వారు వృత్తిపరమైన ఇబ్బందులు ఎదుర్కొంటారు.




గ్రహాల ప్రతికూలతల వల్ల చేసే ఆలోచనలు కలసిరావు. కుటుంబంలో నిరాశ, నిస్పృహలు పెరుగుతాయి. తరచూ తప్పనిసరైన ప్రయాణాలుంటాయి. విద్యార్థులు పట్టుదలతో ప్రయత్నించాలి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆదాయం పర్వాలేదు. ఉద్యోగాలలోని వారికి స్థాన చలనం. వ్యవసాయం, కళ, క్రీడా రంగాలలోని వారికి మాట తొందర వల్ల కష్టనష్టాలుంటాయి.




తలపెట్టిన పనుల వ్యవహారాలలో ప్రతికూలతలు, నమ్మకమైన వ్యక్తులు కూడా వ్యతిరేకిస్తారు. వృత్తి, వ్యాపారాలలోనివారికి ఖర్చుకు తగ్గ ఆదాయం, అనవసర ప్రయాణాలు వుంటాయి. ఇతరుల వ్యవహారాలలో జోక్యం చేసుకోవద్దు. విద్యార్థులకు సామాజిక గుర్తింపు, అనుకొన్న పనులు నెరవేరుతాయి. వ్యవసాయ, కళా, క్రీడా రంగాలలోని వారికి సామాన్యంగా వుంటుంది.




చేసే పనులు కష్టంగా వుంటాయి. ప్రయాణాల పట్ల పలు జాగ్రత్తలు అవసరం. కుటుంబంలోఅవసరాల నిమిత్తం ధన వ్యయం. వృత్తి, వ్యాపారాలలో ఆదాయ, వ్యయాలకు పొంతన వుండదు. వ్యవసాయదారులు అనుకూలతలు సాధిస్తారు. కళా, క్రీడా రంగాలలోని వారికి తరచూ ఆటంకాలుంటాయి. రాజకీయులు అధికార వర్గాలతో, క్రింది వర్గాలతో సంయమనం పాటించాలి.




ఏ పనిలోనైనా ధైర్యం, నమ్మకం అవసరం. కొన్ని వ్యవహారాలలో నిర్మోహమాటం, నిక్కచ్చితనం చూపుతారు. విద్యార్థులు చదువుపై శ్రద్ధ వహిస్తారు. వ్యవసాయ, కళా, క్రీడా రంగాల వారికి రుణాలు లభిస్తాయి. గృహ, వాస్తు మార్పులకు ప్రాధాన్యతలిస్తారు. అవసరానికి రుణం లభిస్తుంది. రాజకీయులు ఏకాకిగా తమ ప్రయత్నాలు సాగిస్తారు. ఇతరులకు ఉపకారం చేసినా మాటపడవలసి వస్తుంది.

# వాస్తు సిద్ధాంతకర్త 'కశ్యపుడు' గ్రంథం కాశ్యప శిల్పం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ బ్రిజేష్‌పాండే — హైదరాబాద్*

*★ మధ్య భారతంలో ప్రయాణిస్తున్నపుడు నేను 'కాశ్యప శిల్పం' ఆంగ్లానువాదం చదివాను. దాని వివరాలు తెలుసా?*

అష్టాదశ వాస్తు శాస్త్రవేత్తల్లో 'కశ్యప మహర్షి' మేధోప జీవి. వివిధ వాస్తులు కూడా కశ్యపశిల్పం ఆధారంగానే దిద్దుబాట్లు చేయబడ్డాయి. అయితే 'భృగు సంహిత' ప్రథమ వాస్తు గ్రంథం. ఈ విషయమై నేను మీకు వివరణ ఇవ్వగలను.

*పి.వి.చరణ్‌తేజ — బెంగుళూరు*

*★ కొన్ని నక్షత్రాలలో జన్మించిన స్త్రీలు కుటుంబ నాశనానికి కారణమవుతారా?*

అదంతా దుష్ప్రచారం. మగవాడు దుష్టబుద్ధితో చేసిన ప్రచారమిది. దుష్టత్వమనేది స్త్రీ, పురుష జాతులలో ఎక్కడైనా వుండవచ్చు.

*డి.సుప్రజారెడ్డి — చవటపాలెం*

*★ నవరత్న ధారణ విషయంలో అనేక మంది అనేక రకాలుగా చెబుతున్నారు.*

నక్షత్రం, పుట్టిన తేదీ ప్రకారం వచ్చే మిత్ర రాశికి, శత్రు రాశులలోని ఆధిపత్య రాశికి వెరసి రెండు రాళ్లు లబ్దిదారుడు ధరించవలసి వుంటుంది.

*పి.విశ్వనాథం — సూళ్లూరుపేట*

*★ రెండు ద్వారాలలో ఉత్తర ద్వారానికి ఎదురుగా సెప్టిక్ ట్యాంకు రావడం మంచిదేనా?*

తూర్పు రాజవీధి గనుక ప్రధాన సింహ ద్వారం తూర్పున వున్నది. ఉత్తర ద్వారం కుబేర స్థానం వల్ల ఏర్పరచబడింది. అందువల్ల ఉత్తరం ప్రధాన ద్వారం కాదు గనుక పర్వాలేదు. నిర్ధారించబడిన యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*పి.ధనుంజయ — తడ*

*★ కుజదోషం వున్నప్పుడు ఏ పూజ చేయాలి?*

కుజ దోషం వున్న వ్యక్తులు సుబ్రహ్మణ్య స్వామి పూజ మండలం(నలభై) రోజులు చేయడం, పూజా గృహంలో నిర్ణయించబడిన యంత్ర ప్రతిష్ట చేసుకోవాలి.

*భండారి రమేష్ — హైదరాబాద్*

*★ ఇంట్లో వాస్తు దోషాలున్నట్లు ఎట్లా తెలుస్తుంది?*

తూర్పు, పశ్చిమ దోషాలు మగవారిపై; ఉత్తరం, దక్షిణం దోషాలు స్త్రీలపై ప్రభావం చూపిస్తాయి. వారి వారి సమస్యల్ని బట్టి దిక్‌దోషాల్ని నిర్ణయించవచ్చు.

*పి.ఎన్.ఆర్ — కావలి*

*★ శ్రీవారు మారుతారా? మార్గాంతరం చెప్పండి?*

జాతకం, వాస్తు ప్లాను, సుదీర్ఘమైన ఉత్తరం అందాయి. మీరు నేను ఉత్తరంలో సూచించిన యంత్ర ప్రతిష్టచేసి, పంచముఖ రుద్రాక్ష పూజ మండలం రోజులు చేయండి. మార్పు కనిపిస్తుంది.

*పి.డి.కె — బిట్రగుంట*

*★ వాస్తు బాగుంది. జాతకాలు చాలా బాగున్నాయి. అయితే మాకు మనఃశాంతి లేదు.*

'వాస్తు మహోదధి' ప్రాచీన గ్రంథంలో స్త్రీ కన్నీటి శాపం, కన్నవారి శాపాలు వాస్తు జ్యోతిష్యాలకంటే విపరీతమైన ప్రభావాన్ని చూపిస్తాయని వున్నది.

*కె.ఇందిర — నాయుడుపేట*

*★ భార్యాభర్తల మధ్య గొడవలు పెరిగిపోయాయి. దీనికి పరిష్కారం చెప్పండి?*

వాయువ్యం సెప్టిక్ ట్యాంక్‌ను వెంటనే తొలగించండి. రుద్రాక్ష మండల పూజావిధానాన్ని ఆచరించండి. ఆగ్నేయం పడక గదిని వాయువ్యానికి మార్చుకోండి. యంత్ర నిర్ధారణ కోసం సంప్రదించండి.

*పి.ఎన్.ఆర్ — కావలి*

*★ ప్రవర్తనలో చాలా తేడా కనిపిస్తోంది. కోపం ఎక్కువ. ఉచితానుచిత ప్రవర్తన లేదు.*

అత్తమామలు సహకరిస్తున్నారు గనుక అతన్ని వెంటనే మానసిక వైద్యుడికి చూపించండి. తర్వాత 'లక్ష్మీ గణపతి' యంత్రాన్ని ప్రతిష్టించుకోండి. తప్పక మార్పు వస్తుంది.

*ఎల్.దేవసునందిని — ఉదయగిరి*

*★ కొన్ని దోషాలున్నప్పటికీ ఏ సందర్భాలలో వివాహ దోషాల్ని పట్టించుకోరు?*

కొన్ని దోషాలున్నప్పటి కీసప్తమ, చతుర్థ భావాలు బాగుంటే మంచిదని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

● నీటి పారుదల ప్రాజెక్టుల

# పనుల పురోగతిని చర్చించని ఐఏబి!

**జిల్లాలో నీటిపారుదల శాఖతోపాటు తెలుగు గంగ, సోమశిల ప్రాజెక్టుల క్రింద వివిధ కాల్వల నిర్మాణం, డ్రైనేజి, డిస్ట్రిబ్యూటరీ సిస్టంలతోపాటు నెల్లూరు, సంగం బ్యారేజి పనులు జరుగుతున్నాయి. ఎలాగూ రెండవ పంటకు నీళ్లివ్వడం లేదు కాబట్టి ఐఏబి సమావేశంలో ఈ పనుల ప్రగతి గూర్చి చర్చిస్తే బాగుండేదని జిల్లా రైతుల మనోభిప్రాయం.**


నత్తనడకన సాగుతున్న నెల్లూరు బ్యారేజి పనులు.

జిల్లాలో జలయజ్ఞం పేరుతో చేపట్టిన సాగునీటి ప్రాజెక్టుల పనుల పురోగతిపై చర్చించేందుకు ఐఏబి సమావేశానికి తీరిక లేకపోయింది. ఇటీవల జిల్లా కలెక్టర్ అధ్యక్షతన జరిగిన ఈ సమావేశంలో ముఖ్యఅతిధిగా పాల్గొన్న జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి పనులు ఏ దశలో వున్నాయన్న దానిపై చర్చిస్తారని రైతాంగం భావించింది. కేవలం రెండవ పంటకు సాగునీరివ్వలేమని ప్రకటించి చేతులు దులుపుకున్నారు. గత సంవత్సరం ఆశించిన మేర జిల్లాలో వర్షాలు కురవకపోవడంతో రిజర్వాయర్లలో నీటి కొరత ఏర్పడింది. ఉన్న నీటితో ఈ సంవత్సరం వరిపంటకు నీరిచ్చి రైతులకు ఎటువంటి ఇబ్బంది లేకుండా చేయడంలో అధికారులు కృషి అభినందనీయం.

ప్రస్తుతం సోమశిల రిజర్వాయర్‌లో వరిపంటకు సరిపడే నీటి లభ్యతలేని కారణంగా రెండవ పంటను విరమించుకోవాలని రైతులను కోరారు. నెల్లూరు నగరంతోపాటు కావలి, అల్లూరు ప్రాంతాలకు త్రాగునీటి సరఫరా చేయాల్సి వున్నందున వున్న నీటిని ఈ అవసరాలకు వినియోగించాలని సమావేశంలో తీర్మానించారు. కనిగిరి రిజర్వాయర్ క్రింద వున్న 19వందల ఎకరాలకు మాత్రం రెండవ పంట వేసుకునేందుకు అనుమతిచ్చారు. 1964 సంవత్సరంలో రాష్ట్రప్రభుత్వం 6 గేట్ల ద్వారా సాగునీరు అందించేందుకు ప్రత్యేక ఉత్తర్వులు జారీ చేసింది. ఈ రిజర్వాయర్ క్రింద వున్న ఆయకట్టుకు సాగునీరందించాలని అధికారులను మంత్రి ఆదేశించారు. ప్రస్తుతం సోమశిల రిజర్వాయర్‌లో 9.154 టిఎంసిల నీటి నిల్వ వుంది. డెడ్‌స్టోరేజ్‌కి 7.558 టిఎంసిలను మినహాయిస్తే 1.596 టిఎంసిలు నిల్వ వుంటుంది. త్రాగునీటి అవసరాలకు దాదాపు 3 టిఎంసిల అవసరమవుతుంది. ప్రస్తుత పరిస్థితుల్లో డెడ్ స్టోరేజ్ నీటిని త్రాగునీటి అవసరాలకు వినియోగించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

జిల్లాలో నీటి పారుదలశాఖతోపాటు తెలుగుగంగ, సోమశిల ప్రాజెక్టుల ఆధ్వర్యంలో వివిధ కాల్వల నిర్మాణం, డ్రైనేజి, డిస్టిబ్యూటరీ సిస్టం, బ్యారేజీ నిర్మాణ పనులు జరుగుతున్నాయి. 2008–2009 సంవత్సరంలో ప్రారంభించిన పనులు నేటికి పూర్తి కాలేదు. కాల్వల లైనింగ్ పనులు పూర్తికాకపోవడంతో చివరి ఆయకట్టుకు సాగునీరందక రైతులు ఇబ్బంది పడుతున్నారు. కొన్ని సందర్భాల్లో ఆయకట్టు రైతుల మధ్య నీటి విషయంలో వివాదాలు జరుగుతున్నాయి. పనులు దక్కించుకున్న కాంట్రాక్టర్లు, సంస్థలు గడువును మరింత పెంచుకునేందుకు ప్రయత్నిస్తున్నాయి. రాష్ట్రప్రభుత్వం గానీ, జిల్లా అధికారులు, ప్రజా ప్రతినిధులు సాగునీటి ప్రాజెక్టుల పనులు పూర్తి చేయించేందుకు పెద్ద కృషి చేయడం లేదన్న విమర్శలు రైతులు నుంచి వినిపిస్తున్నాయి. ప్రతి సంవత్సరం రెండు దఫాలు జరిగే ఐఏబి సమావేశంలో పనులు పూర్తి చేసేందుకు గడువును పెంచుతున్నట్లు అధికారులు చెబుతూ వస్తున్నారు.

పదిమంది శాసనసభ్యులు, ఇద్దరు పార్లమెంటు సభ్యులు ముగ్గురు ఎమ్మెల్సీలు జిల్లా నుంచి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఇటీవల నిర్వహించిన ఐఏబి సమావేశానికి తెలుగుదేశం పార్టీకి చెందిన కురుగొండ్ల రామకృష్ణ, బీద మస్తాన్‌రావు, నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి మాత్రమే హాజరయ్యారు. మిగిలిన ఆరుగురు ఎమ్మెల్యేలు, ఇద్దరు పార్లమెంటు సభ్యులు, ఎమ్మెల్సీలు గైర్హాజరయ్యారు. ప్రాధాన్యత గల ఈ సమావేశానికి ప్రజాప్రతినిధులు హాజరుకాకపోవడం కారణంగా ప్రాజెక్టు పనుల గురించి చర్చించే అవకాశం లేకుండాపోయింది. ఈ సంవత్సరం రెండవ పంటకు నీరిచ్చే అవకాశం లేనందున ప్రాజెక్టు పనులు పూర్తి చేయాలని సాగునీటి వినియోగదారుల సంఘాల నేతలు ప్రభుత్వాన్ని కోరుతున్నారు. కాల్వలకు నీటి విడుదల ఇప్పటికే నిలిపివేశారు. తిరిగి వ్యవసాయసాగు చేసేందుకు 6నెలలు వ్యవధి వున్నందున పెండింగ్ పనులు పూర్తి చేయాల్సిన బాధ్యత నీటిపారుదల శాఖ స్వీకరించాలి.

# జనం మెచ్చని షాడో!



✍ అల్లూరు రహీం

హీరో వెంకటేష్ నటించిన చంటి, సుందరకాండ, శత్రువు, ఘర్షణ, నువ్వు నాకు నచ్చావ్, సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు చిత్రాలను పరికిస్తే ఒకదానికొకటి సంబంధాలు ఉండవు. వైవిధ్యాన్ని నమ్ముకొన్న నటుడాయన. అందుకే సినీ పరిశ్రమలో రెండున్నర దశాబ్దాలుగా ఆయన ప్రయాణం నిర్విరామంగా కొత్త బాటలో సాగుతూనే వుంది. తాను యాక్షన్ సినిమాలు చేశానని పాతతరానికి తప్ప కొత్త తరానికి తెలియదు కాబట్టి 'షాడో' చిత్రంలో నటించానని వెంకటేష్ చెప్పుకొన్నారు. తాను యాక్షన్ సినిమాల్లో కూడా మెప్పిస్తానని షాడో సినిమా నిరూపిస్తుందని చెప్పిన విక్టరీ హీరోను ఈ రివేంజ్ ఫార్మేట్ సినిమా బొక్కబోర్లా పడేలా చేసింది. దీనికి కారణం ముగ్గురు. ఒకరు దర్శకుడు మెహర్ రమేష్, మిగతా ఇద్దరు కథా రచయితలు కోన వెంకట్, గోపిమోహన్‌లు. మెహర్ రమేష్ పెద్ద బడ్జెట్‌తో తీసిన బిల్లా, కంత్రీ సినిమాలు బాగా ఆడకపోయినా టేకింగ్ బాగుంటుందని ఆయనకు ఇంకా సినిమా ఛాన్సులిచ్చే నిర్మాతలు పరిశ్రమలో ఉన్నారు. షాడోలో మాత్రం ఆయన టేకింగ్‌ను మాత్రమే నమ్ముకోక సెంటిమెంట్, కామెడీ, ఫైట్స్, పగ, ప్రతీకారాలు వంటివన్నీ చొప్పించాడు. ఈ అంశాలు చొప్పించిన తీరు బాగా లేకపోవడం, షాడో పేరుకు తగ్గట్టు వెంకటేష్ నుంచి నటనను రాబట్టుకోవడంలో మెహర్ రమేష్ పూర్తిగా విఫలమయ్యాడు. హీరోయిన్ తాప్సిని అయితే ఐటమ్‌గాళ్‌ను చేసి పారేశాడు. పిల్ల మంచి బందోబస్తు గుందే, నాటీగాళ్ చరణాలతో సాగే పాటల్లో ఐటమ్ గాళ్స్ సైతం విస్తుపోయేలా పొదుపు దుస్తులతో కనిపించిందామె. అసలు ఆమెకు వెంకటేష్‌కు కెమిస్ట్రీ ఏ సన్నివేశంలోనూ కుదరలేదు. వాస్తవానికి కోన వెంకట్, గోపీమోహన్ సృష్టించే కామెడీ పాత్రలు బాగుంటాయి. ఈ చిత్రంలో సైకో శీనుగా వాళ్ళు సృష్టించిన ఎంఎస్ నారాయణ పాత్ర వికారంగా ఉంది. పైపెచ్చు సినిమాలో ఈయన పోస్టుమార్టమ్స్ నిర్వహించడంలో స్పెషలిస్ట్. ఆయన మలేషియాకు వెళ్లినా అక్కడ శవాలు పోస్ట్‌మార్టం చేసే డ్యూటీ ఈయనకు వేస్తారు. పొరపాటున కూడా ఇది సాధ్యం కాదని దర్శకునికి, రచయితలకు తెలియదా? ప్రేక్షకులు మరీ అంత వెర్రి వెంగళప్పలా?? అయితే శ్యామ్.కె.నాయుడు కెమెరా మలేషియా, స్విట్జర్లాండ్ దేశాల అందాలను అద్భుతంగా చూపింది. మలేషియా రోడ్లపై ఛేజింగ్, పాటల చిత్రీకరణ తీరు ప్రశంసించాల్సిందే. గబ్బర్‌సింగ్ తరహా కామెడీ పాటను తీయడం మెహర్ రమేష్‌కు చేతకాలేదు. కథ మలుపుల పేరిట చిత్రం చూస్తున్న ప్రేక్షకులను గందరగోళ పర్చి పారేస్తుంది. స్క్రీన్‌ప్లేలో బిగువు లేకుండా పోవడం వల్లే ఇదంతా జరిగిందనాలి. తాప్సిని ఒక చోట బికినీలో చూపిస్తూ ప్రక్కనే అనుష్కను చూపి పొరపాటు చేశాడు. బికినీలో అనుష్కకే ఎక్కువ మార్కులు పడతాయని బహుశా దర్శకుడు ఊహించి ఉండడు.




చిత్రకథలోనికి వెళ్తే ముంబాయిలో 1993లో జరిగిన బాంబు పేలుళ్లకు మాఫియా నాయకుడు నానాభాయ్(ఆదిత్య పంచోలి) కారకుడు. ఈ గ్యాంగ్‌లోనే పనిచేస్తూ ఉండే రఘురామ్(నాగబాబు) ఈ వివరాలన్నీ సేకరించి జర్నలిస్ట్ సూర్య(సూర్య) చేతికిస్తాడు. ఈ విషయం తెలిసిన ఆ మాఫియా గ్యాంగ్ రఘురామ్, అతని భార్యాపిల్లలను అంతమొందించే ప్రయత్నం చేయగా రాజారాం(వెంకటేష్) తప్పించుకొంటాడు. తన వాళ్లను తన కళ్ల ముందే చంపిన గ్యాంగ్‌ను అంతమొందించాలన్న లక్ష్యంతో షాడోగా మారుతాడు. నానాభాయ్ మలేషియాకు స్థావరం మార్చగా తాను అక్కడికి వెళ్తాడు. ఈ గ్యాంగ్‌లోని రాబర్ట్, షకీల్, గురులను ఒక పథకం ప్రకారం హతమారుస్తాడు. ఈ గ్యాంగ్‌ను పట్టను ఇండియా నుంచి వచ్చే అసిస్టెంట్ పోలీస్ కమిషనర్ ప్రతాప్(శ్రీకాంత్) తన చెల్లెలు భర్తని, తల్లి కూడా బ్రతికుందని ఒకానొక సంఘటన ద్వారా తెలుసుకొంటాడు షాడో. ఆ తర్వాత కథ హైదరాబాద్‌కు మారుతుంది. ఎసిపి త్యాగి(నాగినీడు), మీడియా సంస్థల నిర్వాహకుడు చైతన్య ప్రసాద్(షాయాజి షిండే) కూడా తన కుటుంబ శత్రువులని తెలుసుకొని వాళ్లను షాడో అంతమొందిస్తాడు. చివరన నానాభాయ్‌ని కూడా హైదరాబాద్‌కు రప్పించి చంపి వేయడంతో కథ పరిసమాప్తమవుతుంది.

వాస్తవం చెప్పాలంటే షాడో గెటప్ హీరో వెంకటేష్‌కు కుదరలేదు. తాప్సి హీరోయిన్‌గా పూర్తి న్యాయం చేసిందనే చెప్పాలి. ప్రేక్షకులు ఊహించినట్లు 'షాడో' లేదని చెప్పక తప్పదు.

## ప్రేమించడం అబద్ధం!



బాలీవుడ్ అగ్ర హీరోయిన్ల రేసులో కత్రినా దూసుకుపోతోంది. హీరోయిన్‌గా తొలి అడుగుల్లో విజయాలు అందుకోలేకపోయింది. వాటినే పాఠాలుగా మార్చుకొంది. తనకు సంబంధించి వస్తున్న విమర్శలకు సూటిగా సమాధానం చెప్పింది. సల్మాన్‌ఖాన్‌తో ఎక్కువ సినిమాలు చేయడంతో మా మధ్య ఏదో సంబంధం ఉందని చాలా మంది అనుకుంటున్నారు. ఆయనంటే గౌరవం తప్పితే వేరే ఏ ఇతర అనుబంధం మా మధ్య లేదు. రణబీర్ కపూర్‌తో ఓ రెండు చిత్రాల్లో నటించాను. ఈ రెండు ప్రేక్షకులకు నచ్చాయి. దాంతో మా మధ్య ప్రేమాయణం సాగుతుందనే వార్తలు వచ్చాయి. కలిసి పార్టీలకు, పబ్బులకు వెళ్లామని చెప్పుకొన్నారు. అదంతా అబద్ధమే. ఈ రోజు వరకూ నేను ఎవర్నీ ప్రేమించలేదు. అయినా ఓ మాట వ్యక్తిగత జీవితం గూర్చి ఎక్కువగా మాట్లాడడం నాకు నచ్చదంది కత్రినా.



## అందమంటే...

గుజరాత్ అందాల పోటీల నుంచి తెలుగు పరిశ్రమకు దిగుమతైన హీరోయిన్ మోనాల్‌గజ్జర్. సుడిగాడు హిట్ తర్వాత ఒక కాలేజి స్టోరీ, లవర్ చిత్రాల్లో నటించే అవకాశం వచ్చింది. నారా రోహిత్ లవర్ చిత్రంలో హీరో. షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ నాకు తొలి అవకాశం దక్కింది తెలుగు చిత్ర పరిశ్రమలోనే. అందుకే ఎప్పటికైనా నా ప్రాధాన్యం తెలుగుకే. అయితే ఇక్కడ నాకు గ్లామర్ పాత్రలు లభిస్తున్నాయి. బికినీలు, టు పీస్‌లు ధరించినంత మాత్రాన అందంగా కనిపిస్తానంటే నేను నమ్మను. అవి నా ఒంటికి నప్పవు కూడా. సుడిగాడు సినిమాలో నేను స్విమ్ సూట్ ధరించాను. కానీ అది ఎక్కడా ఎబ్బెట్టుగా అనిపించలేదంది మోనాల్ గజ్జర్.

## బబ్లీగాళ్ పాత్రలు దక్కవు!



లీడర్ చిత్రంతో తెలుగు పరిశ్రమకు పరిచయమైన భామ ప్రియా ఆనంద్. తర్వాత ఆమె తెలుగులో 180, కో అంటే కోటి చిత్రాల్లో నటించింది. బాలీవుడ్‌లో ఇంగ్లీష్ వింగ్లిష్, రంగ్రీజ్‌లో ఆడిపాడింది. ప్రస్తుతం తన స్థితిగతులను గూర్చి వివరిస్తూ ప్రతి చిత్రంలోనూ కథానాయిక ప్రాధాన్యమున్న పాత్రే దక్కాలని కోరుకుంటే ఎలా కుదురుతుంది. ఆ అవకాశం వచ్చినప్పుడు మనమేంటో నిరూపించుకుంటే చాలు. ప్రతి చిత్రంలోనూ బబ్లీ గాళ్‌గా నటిస్తానంటే ఎలా కుదురుతుంది. కాస్త బబ్లీగా కనిపించినా ఏ ఒక పాత్రకు మరో పాత్రకు సంబంధమే లేదు. ప్రతి పాత్ర మనలోని ఓ కొత్త కోణాన్ని తెరపై ఆవిష్కరిస్తుంది. బబ్లీ, హుషారు... ఈ రెండింటికి చిన్న తేడాయే ఉంటుంది. అదేంటో నాకు తెలుసు. అందుకే నటించిన పాత్రల్లో ప్రేక్షకుల్ని మెప్పించగలిగానంటుంది.

## నవదీప్ అవయవ దానం



తెలుగు సినీజనాలు కేవలం తమ చిత్రాలకే పరిమితం కావడం లేదు. స్ఫూర్తిదాయకమైన కార్యక్రమాల్లోనూ పాల్గొంటూ తమ సామాజిక దృక్పథాన్ని చాటుకొంటున్నారు. అవయవ దానం చేస్తామంటూ రాజమౌళి, నాగార్జున, అమల, లక్ష్మి మంచు లాంటి వారు ప్రమాణం చేశారు. ఆ జాబితాలో యువ నటుడు నవదీప్ కూడా చేరాడు. ఇటీవలే హైదరాబాద్‌లో నవదీప్ తన నిర్ణయాన్ని ప్రకటించాడు. నగరంలోని మోహన్ ఫౌండేషన్‌కు సంబంధించిన కార్యక్రమంలో ఆయన పాల్గొన్నారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ అవయవదానం ఆవశ్యకత అర్థమైంది. ఇందుకు తాను సమ్మతిస్తున్నానన్నాడు.



## పవర్ స్టార్‌తో సంపత్ నంది!

రచ్చతో మాస్ డైరక్టర్‌గా గుర్తింపు పొందాడు సంపత్ నంది. ఇప్పుడాయనకు మరో మెగా హీరో సినిమాయే దక్కింది. పవన్ కళ్యాణ్ హీరోగా నటించే చిత్రానికి నంది దర్శకత్వం వహిస్తాడు. ఇది గబ్బర్‌సింగ్ చిత్రానికి కొనసాగింపు. పవన్ కళ్యాణ్ క్రియేటివ్ వర్క్స్ పతాకంపై నిర్మితం కాబోతోంది గబ్బర్‌సింగ్–2. పవన్ సన్నిహితుడు శరత్ మరార్ నిర్మాత. ఈ చిత్రంలో కాజల్‌ను హీరోయిన్‌గా ఎంపిక చేయనున్నారు.

# రైతు చైతన్య యాత్రల్లో రైతులేరీ?

వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో గత నెల 22వ తేదీ నుంచి జిల్లాలో రైతు చైతన్య యాత్రలు జరుగుతున్నాయి. ఈ యాత్రల్లో వ్యవసాయ శాఖకు అనుబంధంగా వున్న ఇతర శాఖల అధికారులు కూడా పాల్గొనాలి. కానీ కొన్ని మండలాల్లో అనుబంధ శాఖల అధికారులు హాజరు కావడం లేదు.

## నామ్‌కేవాస్తే కార్యక్రమం

అంతే కాకుండా ఈ వేసవిలో రైతు చైతన్య యాత్రలు నిర్వహిస్తుండడంతో రైతులు కనిపించని పరిస్థితి. జిల్లాలో ఇప్పటికే అన్ని మండలాల్లో ఇందిరమ్మ కలలు పేరుతో, ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళికా చట్టం, అమ్మహస్తం పథకాలపై ప్రజలకు అవగాహన కల్పించేందుకు సదస్సులు, గ్రామ సభలు జరుగుతున్నాయి. మరో ప్రక్క వ్యవసాయశాఖ అధికారులు రైతు చైతన్య యాత్రల పేరుతో గ్రామాలకు వెళ్లిన సమయంలో అధికారులను పలకరించేవారు కరువయ్యారు. దీంతో ఈ యాత్రల లక్ష్యం నెరవేరకుండా పోయే అవకాశం ఏర్పడింది. రానున్న వ్యవసాయ సీజన్‌లో ఏ రకాల వరి పంటలు వేసుకుంటే రైతులకు అధిక దిగుబడి వస్తుందన్న విషయాన్ని వివరించడంతోపాటు నాట్లువేసిన దగ్గర నుంచి కోత దశకు వచ్చేవరకు వినియోగించాల్సిన రసాయనిక ఎరువులు, పురుగు మందులు ఏ మేరకు వాడాలన్న దానిపై రైతులకు సూచనలు, సలహాలు అందించాలన్నది ఈ యాత్రల ప్రధాన ఉద్దేశం. మండల స్థాయిలో వున్న అన్ని శాఖల అధికారులు ఇందిరమ్మ కలల కార్యక్రమాలకు వెళుతుండడంతో వ్యవసాయశాఖ నిర్వహించే కార్యక్రమాల గురించి పట్టించుకునే వారు లేకుండా పోవడం విశేషం.

# నిరసనలకు తరలివచ్చే వారేరి?

## ● ఇబ్బంది పడుతున్న పార్టీలు

కొంచెం ఇష్టంగా... కొంచెం కష్టంగా అన్నట్లుంది రాజకీయ పార్టీల వ్యవహారశైలి. అధికారపక్షం మినహాయిస్తే మిగతా రాజకీయ పార్టీలన్నింటిది. తెలుగుదేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు వివిధ కార్యక్రమాల పేరుతో ప్రజల్లోకి వస్తున్నాయి. ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను నిరసిస్తూ ఆందోళనలు చేస్తున్నాయి. అంతవరకు బాగానే వున్నా ఏ కార్యక్రమాన్ని జరపాలన్నా, దానిని విజయవంతం చేయాలన్నా డబ్బు ప్రధాన పాత్ర పోషిస్తుంది. కార్యకర్తలను తీసుకొని రావడం దగ్గర్నుంచి వారికి రవాణా, భోజన సౌకర్యాలు, మద్యం సరఫరా వరకు అన్నింటినీ భరించాల్సి వుండడంతో నేతలు ఆర్థిక భారం మోయలేక సతమతం అవుతున్నారు. ముఖ్యంగా తెలుగుదేశం పార్టీ గత తొమ్మిదేళ్లుగా అధికారానికి దూరంగా వుండడంతో ఆ పార్టీ నేతలకు కార్యక్రమాల నిర్వహణ కష్టతరంగా మారింది. గత కొన్నేళ్లుగా పదవులకు, అధికారానికి దూరంగా వుండడంతో చేతి చమురు వదిలించుకోవాల్సి రావడంతో పార్టీ కార్యక్రమాలంటే పెద్దగా ఉత్సాహం చూపడం లేదు. జగన్ పార్టీ నేతల పరిస్థితి అలాగే వుంది. నియోజకవర్గ సమన్వయకర్తల పేరుతో



తక్కువ మంది కార్యకర్తలతో గాంధీబొమ్మ వద్ద ధర్నా చేస్తున్న తెలుగుదేశం పార్టీ.

నియామకాలు జరిపారు. ఈ బాధ్యతలు అప్పగించిన వారికి వచ్చే ఎన్నికలలో టిక్కెట్లన్న ప్రచారం జరగడంతో ఇప్పటి నుంచే జనంలోకి వెళ్లేందుకు వివిధ కార్యక్రమాలు రూపొందించుకొని తిరుగుతున్నారు. ఇది కూడా వ్యయంతో కూడుకున్నది కావడంతో తప్పనిసరై ఆ భారాన్ని మోస్తూ భవిష్యత్తు ఆశలకు పల్లకి నిర్మించుకొంటున్నారు. మొత్తంమీద రాజకీయ పార్టీల నేతలకు ఈ అంశాలు కొంచెం ఇష్టంగా, మరి కొంచెం కష్టంగా మారాయి.

## ● అరచేతిలో వైకుంఠం చూపిస్తున్న

# స్కూళ్ల యాజమాన్యాలు!

విద్యా వ్యాపారం మొదలైంది. మిగతా వ్యాపార సంస్థలు ఖాతాదారులను ఆకట్టుకొనేందుకు వివిధ ఆకర్షణీయమైన పథకాలు ప్రవేశపెడుతున్న చందంగా విద్యాసంస్థలు తమ వ్యాపార అభివృద్ధి కోసం విద్యార్థులను తమ పాఠశాలలు, కళాశాలల్లో చేర్చుకునేందుకు కొత్త ఎత్తులు వేస్తున్నారు. ఫీజుల రాయితీ పేరుతో, అమోఘమైన విద్యాబోధన పేరుతో, తమలాంటి విద్యాసంస్థ మరెక్కడా లేదన్నట్లు అబద్ధపు ప్రచారాలు, ఆర్భాటపు ప్రకటనలతో రంగంలోకి దిగేశాయి. రంగు రంగుల కరపత్రాలు ముద్రించి విద్యార్థుల ఇంటి చిరునామాలు తెలుసుకొని వారికి అరచేతిలో స్వర్గాన్ని చూపినంత తీయగా, కమ్మగా మాటలు చెప్పి బుట్టలో వేసుకొనే ప్రయత్నాలు మొదలు పెట్టాయి. మా విద్యాసంస్థలో నాణ్యమైన విద్యను అందిస్తామనే దగ్గర్నుంచి, శుద్ధి

### ● మొదలైన విద్యా వ్యాపారం

చేయబడిన నీటిని, విశాలమైన తరగతి గదులు వున్నాయని, గాలి స్వచ్ఛంగా వుంటుందన్న బిల్డప్ ఇవ్వడానికి వెనుకాడడం లేదు. కొన్ని కార్పొరేట్ విద్యాసంస్థలైతే తమ ఏసి క్యాంపస్‌లో పిల్లలకు ఎండ తగలకుండా, చెమట పట్టకుండా చదువు చెబుతామని తల్లిదండ్రుల నెత్తిన కుచ్చుటోపీ పెడుతున్నారు. ఇందుకోసం ప్రైవేట్, కార్పొరేట్ విద్యాసంస్థల యాజమాన్యాలు అన్నిరకాల ప్రచార కార్యక్రమాలను రూపొందిస్తున్నాయి. ప్రభుత్వ టీచర్లను, ప్రైవేట్ ఉద్యోగులను దళారీలుగా వినియోగించుకొని విద్యార్థులను, వారి తల్లిదండ్రులను ఆకట్టుకొనే పనిని ఆరంభించాయి. ముందు ముందు ఇంకెంత రసవత్తరంగా వుంటుందో ఈ ప్రచారం.

# టిక్కెట్ ధరలు పెరిగాయి - సౌకర్యాలు మాత్రం నాస్తి!

## నెల్లూరు సినిమా హాళ్లలో ఎన్నో అవస్థలు

సినిమా టిక్కెట్ల రేట్లు పెరిగాయి. సినిమా హాళ్లలో టిక్కెట్ల ధరలను పెంచుకోవడంపై ప్రభుత్వం అనుమతివ్వడంతో ఒక్కసారిగా టిక్కెట్ ధరలు అమాంతం పెరిగి పోయాయి. జిల్లాలోనూ దీనికి అనుగుణంగా వివిధ తరగతుల టిక్కెట్ రేట్లు పెంచేశాయి హాళ్ల యాజమాన్యాలు. 20 రూపాయలను నేల టిక్కెట్ ధర మాత్రం పెంచకుండా మిగతా క్లాసుల ధరలు పెంచారు. 30 రూపాయలున్న టిక్కెట్ ధర 40 రూపాయలైంది. 40 రూపాయలున్న టిక్కెట్ ధర కాస్త 60 రూపాయలు, 60 రూపాయలున్న టిక్కెట్ ధర 75 రూపాయలుగా పెంచారు. అర్చన, నర్తకి, రాధామాధవ్, లీలామహల్, సిరి తదితర సినిమాహాళ్లలో ఏప్రెల్ 28వ తేదీ నుంచి పెరిగిన టిక్కెట్ ధరలు అమలులోకి వచ్చాయి. ప్రభుత్వం తీసుకొన్న ఈ నిర్ణయం వలన సగటు ప్రేక్షకుడిపై సినిమా చూడాలంటే అదనపు భారం పడనుంది. ఒకవైపు టిక్కెట్ల ధరలను క్షణాల్లో పెంచేసిన థియేటర్ల యాజమాన్యాలు ప్రేక్షకులకు కనీస సౌకర్యాలు కల్పించడంలో మాత్రం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయి. ఏసి సరిగా వేయకుండా ప్రేక్షకులను దగా చేస్తున్నారు. సినిమా హాళ్లలోని క్యాంటిన్లలో ఆహార పదార్థాలు అధిక రేట్లకు అమ్ముతూ



సామాన్యుడు ఇక సినిమా చూడడం కష్టమే.

దోపిడీ చేస్తున్నారు ప్రేక్షకులను. త్రాగడానికి మంచి నీళ్లు వుండవు. దాహంవేస్తే మంచి నీళ్లు కొనాల్సిందే. దీనిపై ఫిర్యాదులు అందుతున్నా సంబంధిత అధికారులు వాటి గురించి పట్టించుకోవడం లేదు. ఎప్పుడో మొక్కుబడిగా యజమానులతో సమావేశం నిర్వహించి, హెచ్చరికలు జారీ చేసి తమ పనైందనట్టు చేతులు దులుపు కొంటున్నారు తప్ప సినీ ప్రేక్షకులకు అందాల్సిన సౌకర్యాల విషయం పట్టించుకోవడం లేదు.

# కోవూరు ఎస్ఐ 'కంత్రీ'!

### విఆర్‌కు పంపిన ఎస్పీ

జిల్లాలోని కోవూరు పోలీస్‌స్టేషన్‌లో సబ్ ఇన్స్‌పెక్టర్‌గా విధులు నిర్వహిస్తున్న నరసింహారావుపై అనేక ఆరోపణలు, ఫిర్యాదులు రావడం కారణంగానే ఆయన్ను విఆర్‌కు పిలిపించినట్లు తెలిసింది. ఇదే స్టేషన్‌లో ఇన్స్‌పెక్టర్ స్థాయి అధికారిగా వున్న ఆయనకు తెలియకుండా అనేక కేసులు రాజీలు చేయించినట్లు కోవూరు మండలంలో ప్రచారం జరిగింది. ఇసుక లారీలు, ట్రాక్టర్ల యజమానుల నుంచి నెలసరి మామూళ్లు తీసుకుంటున్నారన్న ఆరోపణలు వున్నాయి. అంతే కాకుండా ఫిర్యాదుదారుల సమక్షంలోనే నిందితుల్ని దబాయించడం, వారి చేత క్షమాపణలు చెప్పించడం వంటి చర్యలకు పాల్పడుతుంటాడు. ఇటువంటి సంఘటనలతో కేసులు రాజీ చేసి చేతులు దులుపుకునేవారు. బాధితులు గట్టిగా మాట్లాడి కేసు నమోదు చేయాలని ఒత్తిడితెస్తే బెయిలబుల్ సెక్షన్ల క్రింద కేసులు నమోదుచేసి పంపుతుంటాడని బాధితులు వ్యాఖ్యానిస్తున్నారు. ఇక్కడ ఎస్ఐగా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి స్టేషన్‌లో మధ్యవర్తులు, దళారుల ప్రవేశం అధికమైంది. చోటా రాజకీయ నాయకులు సైతం స్టేషన్‌కు వచ్చి కేసుల రాజీల గురించి ఎస్ఐతో చర్చిస్తుంటారు. అనేక అవినీతి ఆరోపణలపై జిల్లా ఎస్పీకి ఫిర్యాదులు అందడంతో పలుమార్లు ఎస్పీ హెచ్చరికలు కూడా చేశారు. అయినా కూడా ఎటువంటి మార్పు కానరాకపోవడంతో తప్పనిసరి పరిస్థితుల్లో విఆర్‌కు పిలుస్తూ ఆదేశాలు జారీ అయ్యాయి. ఆయన స్థానంలో ఎస్ఐగా నియమితుడైన వెంకటరమణారెడ్డి దళారులు, మధ్యవర్తులకు స్టేషన్‌లోకి అనుమతించబోమని బాధ్యతలు స్వీకరించిన వెంటనే మీడియాతో చెప్పారు. కేసులు నమోదు చేయని, దర్యాప్తు సక్రమంగా చేయని ఎస్ఐల పట్ల మరింత కఠినంగా వ్యవహరించాల్సిన అవసరం వుంది.

# కోడూరు తీర ప్రాంతంలో నారాయణ దంత వైద్య శిబిరం!

### 500 మంది మత్స్యకారులకు దంత చికిత్స

కోడూరు పాతవట్టపుపాళెంలో నారాయణ మెడికల్ కళాశాలకు చెందిన దంతవైద్యులు ఏప్రెల్ 22న ఉచిత వైద్యశిబిరం నిర్వహించారు. కోర్సును అభ్యసిస్తున్న వారితోపాటు సీనియర్ దంతవైద్యులు ఇందులో పాల్గొని షుమారు 500 మంది మత్స్యకారులకు వైద్య పరీక్షలు నిర్వహించి మందులను ఉచితంగా అందించారు. ఆరోగ్యంపై అవగాహన కల్పించిన వైద్యులు పనిలో పనిగా మత్స్యకారుల జీవన శైలిని తెలుసుకొన్నారు. ఈ కార్యక్రమంలో దంతవైద్యులు సుధీర్, కార్తీక్, శ్రీనివాస్, షరీన్, రేవతి, పాళెం కాపు పుల్లయ్య, నరసింహులు, పోలయ్య తదితరులు పాల్గొన్నారు.

## కండ్లేరుకు కన్నం

మొదటి పేజీ కొరవ

దిగా నడవడమే అభ్యంతరకరం. కృష్ణ నుంచి వరద నీరు అదనంగా పారించినప్పుడు మాత్రమే చిత్తూరు జిల్లాకు నీరు తీసుక వెళ్తామనే షరతు పెట్టి, కొత్త పథకాన్ని నిర్మిస్తే అనుమతించవచ్చు. అటువంటి నిర్ణయం ఏదీ లేకుండా నేరుగా పైప్ లైన్ పరవడం నెల్లూరు జిల్లాకు ద్రోహం చేయడం క్రిందే లెక్క. ఈ అన్యాయాన్ని జిల్లా ఎమ్మెల్యేలందరూ గుడ్లప్పగించి చూస్తూ వుండిపోవడం ఇంకా అన్యాయం. ఇందుకా వారికి ఓట్లు వేసి గెలిపిచిందింది? జిల్లా రైతాంగం మేల్కొని ఈ నీటి చోరీకి ఆదిలోనే అంతం పలక కుంటే దీర్ఘకాలంలో జరిగే నష్టం చాలా ఘోరంగా వుండబోతుంది.



నెల్లూరు సుబేదారుపేటలోని సెంట్‌జాన్స్ ఇంగ్లీషు మీడియం స్కూల్ పూర్వ విద్యార్థుల సంఘం నిర్వాహకులకు ఇక్కడ చదివే పేద విద్యార్థుల చదువుకు సహాయం చేయమని 30వేల రూపాయల విరాళాన్ని అందిస్తున్న ఆ స్కూల్ పూర్వ విద్యార్థి వేములపాటి అజయ్‌కుమార్.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

విద్యార్థులు మంచి ప్రతిభ చాటారు. ఎంపిసి విభాగంలో పి.సందీప్ 962, వై.శేషాద్రి 950, షేక్ సబీహా 945 మార్కులు సాధించారు. బైపిసి విభాగంలో జి.నాగేశ్వర్‌రెడ్డి 872, ఎస్.హరిత 860 మార్కులు సాధించారు. ఈ విద్యార్థులను విద్యాసంస్థల డైరక్టర్ సి.శ్రీధర్‌రెడ్డి ప్రత్యేకంగా అభినందించారు.

## చేసిన పనులనే తిరిగి ప్రారంభించిన మంత్రి!

ఇందుకూరుపేటలో ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి పర్యటన విమర్శలకు దారి తీసింది. జిల్లాలోని వివిధ ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించి, ప్రభుత్వ పథకాల అమలుపై పూదరగొట్టిన మంత్రి ఇక్కడా అలాగే వ్యవహరించినప్పటికీ గతంలో ప్రారంభించిన పనులనే తిరిగి ప్రారంభించి ప్రజలను నమ్మించబోయి విమర్శలు మూటగట్టుకొన్నాడు. ఇటీవల ఇందుకూరుపేటకు వచ్చిన ఆయన అమ్మహస్తం పథకాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో మంత్రి మాట్లాడుతూ రాష్ట్రంలో 15 లక్షల మంది లబ్ధిదారులకు తెల్లరేషన్‌కార్డులు మంజూరు చేస్తామన్నారు. మైపాడు బీచ్‌లో పర్యాటక సంస్థ నిర్మించిన హరిత రిసార్ట్‌ను ఆ శాఖ మంత్రి త్వరలో ప్రారంభిస్తారన్నారు. అంతవరకు బాగానే వున్నా రాముడుపాళెం - పల్లిపాళెం, కొరుటూరు-పట్టపుపాళెం రోడ్డు పనులు ఇప్పటికీ ప్రారంభం కాగా తిరిగి అదే పనులను మంత్రి కొత్తగా ప్రారంభించడం, శంకుస్థాపనలు చేయడం చర్చనీయాంశమయ్యింది. ప్రజలను బురిడీ కొట్టించాలని మంత్రి, అధికారులు చూడడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఈ కార్యక్రమంలో స్థానిక నేత బలరామిరెడ్డి, గునుపాటి సోదరులు, ఎమ్మెల్సీ నారాయణరెడ్డి తదితరులు పాల్గొన్నారు. మంత్రి ఇటువంటి పొరపాటు చేయడం సబబు కాదేమో!

## కనకాభిషేకం

తిరుపతికి చెందిన శ్రీవాసవి ఆర్యవైశ్య సేవా సమాజం ఆధ్వర్యంలో గత ఐదేళ్లుగా ఆర్యవైశ్య దంపతులకు కనకాభిషేక కార్యక్రమం నిర్వహిస్తున్న విషయం తెలిసిందే. దీనిలో భాగంగానే ఈ ఏడాది ఈ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు సిద్ధమయ్యారు. జూన్ 23వ తేదిన ఆర్యవైశ్య దంపతుల సామూహిక కనకాభిషేక కార్యక్రమం నిర్వహిస్తున్నట్లు తిరుపతిలో స్థిరపడిన నెల్లూరీయుడు, వాసవి ఆర్యవైశ్య సేవాసమాజం కార్యదర్శి జి.నరసింహారావు తెలిపారు. ఈ కార్యక్రమంలో పాల్గొనదలచిన వారు మే 15వ తేదీలోగా తమ దరఖాస్తులను తిరుపతి, కొత్తవీధిలో గల కార్యాలయ చిరునామకు పంపాలని లేదా 98492 82762 అనే నెంబర్‌లో గాని సంప్రదించాలని కోరారు.

## కృష్ణచైతన్యలో మెరుగైన ఫలితాలు

నెల్లూరు మద్రాస్ బస్టాండ్ వద్ద గల కృష్ణచైతన్య జూనియర్ కళాశాలలో చదివిన విద్యార్థులు ఇంటర్ ద్వితీయ సంవత్సరం ఫలితాల్లో మెరుగ్గా నిలిచారు. ఎంపిసిలో విభాగంలో రోజా 983 మార్కులు సాధించింది. ఈమె గ్రూప్ సబ్జెక్టులలో 600 మార్కులకు గాను 600 సాధించడం విశేషం. ఉత్తేజ్‌రెడ్డి 979, శ్రీహరి 979 మార్కులు సాధించగా, ఎంఇసిలో హిమబిందు 959 మార్కులు పొందింది. ఈ సందర్భంగా కృష్ణచైతన్య కళాశాల డైరక్టర్లు చంద్రశేఖర్‌రెడ్డి, కృష్ణారెడ్డిలు మాట్లాడుతూ కాలేజి స్థాపించినప్పటి నుంచి ఇప్పటివరకు ఎమ్పీసి విభాగంలో తమ విద్యార్థులు 980కు పైగా మార్కులు సాధించడం ఆనందంగా ఉందన్నారు.

## తడ దగ్గర బస్సు ప్రమాదం ఇద్దరు దుర్మరణం!

చెన్నై నుంచి విజయవాడ వెళ్తున్న వోల్వో బస్సు 2వ తేది అర్థరాత్రి దాటాక భీమునివారి పాళెం చెక్‌పోస్ట్ వద్ద ముందు వెళ్తున్న ఇనుప చువ్వల లారీని ఢీకొట్టింది. ఈ ప్రమాదంలో వోల్వో బస్సు డ్రైవర్ వెంకటేశ్వర్లు, ముందు సీట్లో కూర్చుని ఉండిన ప్రయాణీకురాలు పండరిబాయి మరణించినట్లు ప్రాథమికంగా అందిన సమాచారాన్ని బట్టి తెలిసింది. మరో ఆరుగురు గాయపడినట్లు తడ పోలీసులు చెప్పారు.

## విజయడైరీ కొత్త పాలు!

ఎన్ని పాలడైరీలు వచ్చినా విజయ డైరీ పాల ప్రత్యేకత మరో పాలలో కనపడవు. ప్రైవేట్ డైరీల విన్యాసాల ఎదుర్కోను మే 1వ తేది విజయ డైరీ కూడా స్కిమ్ మిల్క్, హోమోజినైజ్డ్ మిల్క్ పేరిట రెండు ఉత్పత్తులను మార్కెట్‌లోనికి విడుదల చేసింది. ఈ కార్యక్రమంలో డైరీ ఛైర్మన్ కొండ్రెడ్డి రంగారెడ్డి పాల్గొన్నారు. తనకు సహకరిస్తున్న పాలక వర్గ సభ్యులకు, రైతులకు, డైరీ సిబ్బందికి కృతజ్ఞతలు చెప్పారు.

## వైకాపా ముత్తుకూరు కన్వీనర్‌గా విష్ణు!



వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ముత్తుకూరు మండల కన్వీనర్‌గా తాళ్లపూడికి చెందిన మెట్టా విష్ణువర్ధన్‌రెడ్డి నియమితులైనట్లు నియోజకవర్గ సమన్వయ కర్త కాకాణి గోవర్ధన్‌రెడ్డి చెప్పారు. విష్ణువర్ధన్‌రెడ్డి ముత్తుకూరులో పట్టున్న నాయకుడు. ఆయన నియామకం పట్ల పార్టీ శ్రేణులు హర్షాన్ని వ్యక్తం చేశాయి. ఈ నియామకం చేసిన పార్టీ గౌరవాధ్యక్షురాలు వైఎస్ విజయమ్మకు అభినందనలు తెలియ జేశాయి.

## ఇంటర్‌లో ప్రభుత్వ కళాశాల విద్యార్థి ప్రతిభ!



ఇంటర్మీడియట్ ద్వితీయ సంవత్సరం పరీక్షా ఫలితాల్లో ప్రభుత్వ కళాశాల విద్యార్థి వెల్లటూరు శ్రీహర్ష అత్యధిక మార్కులు సాధించాడు. బాలాయపల్లి మండలం వెంగమాంబాపురంలోని ప్రభుత్వ జూనియర్ కళాశాలలో చదువుతున్న ఈ విద్యార్థి ఎంపిసి విభాగంలో 948 మార్కులు సాధించి జిల్లాలోని ప్రభుత్వ కళాశాలల్లో ప్రథమునిగా నిలిచాడు. వేలాది రూపాయలు ఫీజులు వసూలు చేస్తూ ప్రైవేటు కళాశాలల విద్యార్థులతో పోటీపడుతూ ప్రతిభ వుండాలేగానీ ప్రభుత్వ కళాశాల, ప్రైవేట్ కళాశాల అన్న తేడాలేదని శ్రీహర్ష రుజువు చేశాడు.

## కాకాణి పాండురంగారెడ్డి దాతృత్వం!

అల్లూరు మండలం నార్తుమోపూరులో భూస్వామ్య కుటుంబీకుడైనా, స్వగ్రామ ప్రజల కోసం సొంత నిధులు వెచ్చించి ఎన్నో మేళ్లు చేసిన కాకాణి వేణుగోపాల్‌రెడ్డి జ్ఞాపకార్థం ఆయన సోదరుడు పాండు రంగారెడ్డి 26 లక్షల రూపాయలకు వెచ్చించి పైగా నెల్లూరు ప్రగతి ఛారిటీస్‌లో రెండు గదులను నిర్మించారు. వీటిని ఎస్పీ రమణకుమార్ ప్రారంభించారు. అనంతరం ఆయన మాట్లాడుతూ పాండురంగారెడ్డిని ఆదర్శంగా తీసుకొని ఇంకొందరు వ్యక్తులు ముందుకొచ్చి సమాజ సేవ చేస్తే బాగుంటుందన్నారు. సోదరుని స్మృత్యర్థం పెద్ద వయస్సులో పాండు రంగారెడ్డి గారు ఇంత శ్రమపడడం అభినందనీయం.

## తూమాటి శ్రీనివాసులురెడ్డి మరణం



గండవరం మాజీ మునసబు తూమాటి శ్రీనివాసులురెడ్డి ఏప్రెల్ 29తేది మరణించారు. మునసబుగా పదవీ విరమణ చేశాక 15ఏళ్లపాటు గండవరం ప్రాథమిక సహకార సంఘం అధ్యక్షునిగా పని చేశారు. ఈయనకు భార్య, ముగ్గురు కుమారులున్నారు. పెద్ద కుమారుడు వసంత్ కుమార్‌రెడ్డి ఆడిటర్‌గా అందరికీ సుపరిచితుడు. రెండవ కుమారుడు రవీంద్రరెడ్డి విఆర్ కాలేజి లెక్చరర్‌గాను, మూడవ కుమారుడు అశోక్ కుమార్ రెడ్డి వేణుగోపాలస్వామి జూనియర్ కళాశాల ప్రిన్సిపల్‌గా పని చేస్తున్నారు. కుటుంబ పెద్దను కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

ఆ మూడురోజులు నగరంలో లైటింగ్ పేరిట ఎంతో విద్యుత్‌ను వృధా చేయడం బాధాకరం.

సి.సుజాత బుచ్చిరెడ్డిపాళెం

### ఇప్పటికైనా గుర్తించారు?

నవరస నటనా సార్వభౌమ కైకాల సత్యనారాయణకు రాష్ట్రప్రభుత్వం ఈ యేడాది రఘుపతి వెంకయ్య అవార్డును ఇచ్చి గౌరవించడం ఆనందకరం. హిందీ విలన్ ప్రాణ్‌కు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డును కేంద్రప్రభుత్వం ప్రకటించడం సంతోషకరం. వెండితెర విలన్లుగా సత్యనారాయణ, ప్రాణ్ ఒక వెలుగు వెలిగారు. బెటర్ లేట్‌దెన్ నెవర్ అన్నట్లు వీరిద్దరి ప్రతిభ గుర్తించడానికి ప్రభుత్వానికి ఇన్నేళ్లు పట్టడం విచిత్రమైనా ఇప్పటికైనా మంచిపని చేసినందుకు సంతోషంగా ఉంది.

ప్రొఫెసర్ నాగరాజరావు హైదరాబాద్

### దుస్థితిలో సంతపేట మార్కెట్!

నెల్లూరు సంతపేటలోని కూరగాయలు, చేపలు, మాంసం అమ్మే మార్కెట్ దుస్థితిలో ఉంది. మార్కెట్ ప్లాట్ ఫారాలు, శ్లాబులతోపాటు చుట్టూ పరిసరాలు దెబ్బతినిపోయాయి. మార్కెట్‌లోని కొళాయిల్లో నీరు రావడం లేదు. టాయిలెట్ల సంగతి చెప్ప నవసరంలేదు. ఆర్థికమంత్రి రామనారాయణరెడ్డి ఇంటికి కూతవేటు దూరంలోని మార్కెట్‌పై ఇంత చిన్న చూపు పనికి రాదు.

డి.దేవయ్య నెల్లూరు

## పదరంగం -65

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | | 5 | | 6 | 7 |
| 8 | | | | | | 9 | 10 | | |
| | | | 11 | | | | 12 | | |
| | 13 | 14 | | | 15 | 16 | | | |
| 17 | | | | | 18 | | | 19 | 20 |
| 21 | | | | 22 | | | | 23 | |
| | | 24 | | | | | 25 | | |
| | | | | 26 | | 27 | | 28 | |
| 29 | 30 | | | | 31 | | 32 | | |
| 33 | | | | 34 | | 35 | | | |

**అడ్డం**

1. సైన్యం, దండు (3)
4. ఆడంబరం. పైన... లోన లొటారం (3)
6. దీర్ఘ నిద్ర (2)
8. క్లుప్తంగా (3)
9. కుమార్తె, సాగదీయబడింది (4)
11. ఆవు (2)
12. బ్యాంకులో విలువైన వస్తువులు దాచుకొనే అర (3)
13. తెలుగు డోరు (3)
15. ఏడు రోజుల సమయం (3)
17. వెక్కిరించే కారం (4)
18. అటునుంచి 'కం' లోపించిన క్షణికం (2)
19. తెలుగు రివర్ (2)
21. అటునుంచి కంటకం (2)
22. జాలి, దయ (3)
23. అటునుంచి పింగళకు ముందు వచ్చే తెలుగు సంవత్సరం (2)
24. అటునుంచి తోకతో (4)
25. అటునుంచి పట్టు పురుగు కోశస్త దశ (3)
26. అటునుంచి మహితము 1,2,3 అక్షరాలు (3)
28. బరువు 1,2 అక్షరాలు (2)
29. మోదముతో కూడిన సమ్మతి (4)
31. రాత్రిపూట తిరిగేవాడు (5)
33. వంద (3)
34. ఇంగ్లీషు తాళం చెవి (1)
35. నందులలో ఒకడు (3)

**నిలువు**

1. గట్టిదనం (3)
2. మూకీ కాదు (2)
3. పావడా (2)
4. పశుత్వం కలది (3)
5. బొంకు కాదు వ్యభిచారం (2)
6. అభిలాష (3)
7. మా తరువాత (1,2,3 అక్షరాలు) (3)
10. లేపనం, పూత మందు (3)
11. దేవాలయ శిఖరం (3)
13. నదీ తీరము, ఒడ్డు (3)
14. క్రింద నుంచి పాదం (2)
15. తడబడిన మద్య ప్రవాహం (5)
16. సెక్యూరిటి (3)
17. ప్రవాహం (3)
19. మిక్కిలి అందగాడైన కుబేరుని కొడుకు (6)
20. సూర్యుడు (5)
22. స్వప్నంతో కూడిన దిగులు, విచారం (3)
24. నీట బుట్టినది కమలం (4)
27. మట్టితో పాటిదే (3)
29. నిరాశ కాదు (2)
30. బరువు (2)
32. చదువులో వు లేదు (2)

**సమాధానాలు**

## పదరంగం -64

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ము | 2 దా | 3 వ | 4 హం | | 5 క్రీ | కా | 6 ర | ణ్య | 7 ము |
| 8 ర | సి | తం | స | | ల | | వ | | ద |
| ళి | | సం | | | 9 కం | బ | ళి | | ము |
| | 10 కా | | 11 ని | 12 జం | | | | 13 క | |
| 14 ణి | రా | 15 పా | | ట | | 16 మొ | 17 ర | | 18 వా |
| | 19 గా | య | ని | | 20 అ | ల | కా | 21 పు | రి |
| 22 వి | ర | సం | | 23 గు | ర | క | | 24 కా | జా |
| 25 రా | ము | | | 26 న | క | లు | | | క్షు |
| మ | | 27 క | 28 ల | ప | | | 29 ప | 30 ది | లం |
| 31 ము | స | ల | క | ము | | 32 అ | ప | వా | దు |

# ఓ ఎమ్మెల్సీ పశ్చాత్తాపం!

**దేశంలోని ఏ రాష్ట్రంలో లేనట్లు మన రాష్ట్రంలో నలభై ఆరు శాతం మంది పిల్లలు ప్రైవేటు స్కూళ్లకు వెళ్తున్నారు. గత పన్నెండేళ్లలో రాజీవ్ విద్యామిషన్ మన రాష్ట్రంలో బడులు బాగు చేయడానికి 19వేల కోట్ల రూపాయలు ఖర్చు చేసింది. దీన్ని దూరదృష్టితో చేసివుంటే కేరళ స్థాయికి కాకున్నా తమిళనాడు స్థాయికి మన ఎలిమెంటరీ స్కూళ్లు ఎదిగి వుండేవి.**

ఏప్రెల్ 19వ తేది 'జమీన్‌రైతు' సంచిక జనవాణి శీర్షికలో ఉపన్యాసాలతో స్కూళ్లు బాగు పడవని కాంతిమతిగారు ఎత్తిపొడవడం న్యాయమైన మందలింపుగానే భావిస్తున్నాను. మన ప్రభుత్వ పాఠశాలల్ని చూస్తున్న వారెవరికైనా ఇలానే అన్పిస్తుంది. టీచర్లు, యూనియన్లూ, ఎమ్మెల్సీలు చదువుల్ని తప్ప అన్నీ పట్టించుకొంటారనే నింద నుంచి బయటపడ్డానికి మేమంతా ఎంత ఆత్మవిమర్శ చేసుకొంటే అంత మంచిది. ఎంత ఆచరణలోకి దిగగల్గితే అంత మరీ మంచిది. ఇది జరగడం లేదు కాబట్టే కాంతిమతి గారి లాంటి వారి ముందు తలవంచుకునే జవాబు చెప్పాల్సి వస్తోంది.

### అపసవ్య ధోరణులు

రెండు అపసవ్య ధోరణులు మమ్మల్నందరినీ ఇలా బోనులోకి ఎక్కిస్తున్నాయి. ఒకటి యల్ఐసి, బ్యాంకులు నవరత్నాల్లాంటి ప్రభుత్వ రంగ సంస్థల, మన ఆర్టీసిలాంటి సంస్థల ఉద్యోగ కార్మిక వర్గానికీ ఉపాధ్యాయ ఉద్యమానికీ పోలికే లేదు. వారి సంఘాలు దుర్మార్గమైన ప్రపంచీకరణ విధానాల్ని నికరంగా ఏకోన్ముఖంగా తిప్పికొట్టడంతోపాటు, రోజువారీ ఆచరణలో తమ వ్యవస్థల్ని మరింత ప్రజామోదం పొందేలా మలచుకోవడానికి ఊహాతీతంగా శ్రమిస్తున్నాయి. సగటు ఉద్యోగినీ, కార్మికుడ్నీ దీనికి తగ్గట్టు చైతన్య పరుస్తున్నాయి. ఇదొక ద్విముఖ పోరాటం. ఆధునిక పరిణత ట్రేడ్ యూనియన్ స్వభావం. టీచర్ల సంఘాలు దీనికి భిన్నంగా ఆర్థిక డిమాండ్ల ఊబిలో, రోజువారీ గొడవల వలయంలో ఇరుక్కుపోయాయి. స్వీయ వ్యవస్థా రక్షణ నుంచి టీచర్లను దూరం చేశాయి. రెండోది లెక్కకు మించిన సంఘాలు, వీరి మధ్య గొంతులు కోసుకొనే పోటీ ఉపాధ్యాయ ఉద్యమాన్ని బాగా చులకన చేశాయి. ఎంతో నేపథ్యం, సిద్ధాంతబద్ధ రాజకీయాలు వున్న సంఘాలు సైతం కనీస ఐక్యత కొరవడి ఎవరికివారై పాలసీ నిర్ణయాల్లో తమ పాత్ర ఏమీలేని పరిస్థితికి దిగజారిపోతున్నాయి. ఫలితంగా సగటు టీచరుకు దారితెన్నూ దొరకక ఒంటరి వాడై పోతున్నాడు. మనకు వేలాది మంది అద్భుతమైన టీచర్లు వున్నారు. వాళ్లని గుర్తించి ప్రోత్సహించి, సమీకరించి, నడిపించే నాథుడే లేడు.

### ప్రైవేటు స్కూళ్లకు 46 శాతం మంది పిల్లలు

రెండో వైపు నుంచి వ్యాపార విద్యా సంస్థలు కమ్ముకొస్తున్నాయి. ఇప్పటికే ఎక్కడా లేనట్లు 46 శాతం పిల్లలు ప్రైవేటు స్కూళ్లకు వెళుతున్నారు. చూస్తుండగానే విద్యకు నిర్వచనమే మారిపోయింది. ఓ దుర్మార్గమైన సంస్కృతి మన చదువుల చుట్టూ అల్లుకు పోయింది. పాఠాలు కనుమరుగై పరీక్షలు, బోధన అదృశ్యమై భట్టీయాలు ముందుకొచ్చి ఒకటో తరగతి నుంచే ఐఐటికి సన్నద్ధం చేస్తామంటే వెర్రెత్తినట్టు పరుగెత్తే దౌర్భాగ్యం దాపురించింది. ప్రపంచంలో ఎక్కడాలేని విద్యావిధానాన్ని మన కార్పొరేట్ సంస్థలు మన ముందు ఆవిష్కరించేశాయి. దీనికి వారిదెంత తప్పో భూమికీ ఆకాశానికీ తేడా మరిచిపోయిన మధ్యతరగతి వర్గానిదీ అంతే తప్పు. ప్రపంచంలోని పెట్టుబడిదారీ, ప్రజాస్వామిక, సోషలిస్టు దేశాలన్నింటిలోనూ మాతృభాషలోనే, ప్రభుత్వ రంగంలోనే పాఠశాల విద్య నడుస్తోంది. మనం నెత్తికెత్తుకొనే అమెరికాలో ఐదు కోట్ల మంది ప్రభుత్వ పాఠశాలల్లో చదువుతుంటే ప్రైవేటు స్కూళ్ల పిల్లలు 20 లక్షలకు మించరు. చైనాలో ఏ గ్రామానికెళ్లినా అన్నిటికంటే మంచి భవనం పాఠశాలదే అయి వుంటుంది. బెత్తెడు ఫిన్లాండు విద్యా ప్రమాణాల్లో ప్రపంచాన్నే పరిహసిస్తోంది. చివరికి చిట్టి శ్రీలంక సైతం తన స్కూళ్లను ప్రపంచానికే నమూనాగా తీర్చిదిద్దుతోంది. ఎక్కడున్నాం మనం? కనీసం కేరళ, తమిళనాడుల నుంచైనా నేర్చుకోలేమా? ఈ మధ్య నీపా(NEUPA) మన ప్రాథమిక పాఠశాలకు ఓ ప్రమాణం నిర్దేశించింది. 150 మంది పిల్లలు, ఆరుగురు టీచర్లు, ఆరు గదులు వున్నది మంచి ప్రాథమిక పాఠశాల అని నిర్వచించింది. అలాంటి స్కూళ్లు కేరళలో 98.6 శాతం వుంటే తమిళనాడు 79 శాతం వున్నాయి. మన ప్రభుత్వ స్కూళ్లలో ఇలాంటివి ఆరంటే ఆరు శాతం. మరి దేశంలో ఎక్కడాలేనట్టు ఏడాదికి మూడు లక్షల మంది పిల్లలు సర్కారు స్కూళ్లను వదిలేస్తున్నారంటే విచిత్రం ఏముంది?

తమ పిల్లల చదువుల కోసం తల్లితండ్రులు ఏ త్యాగానికైనా సిద్ధపడుతున్నారు. ఈ విద్యాదాహం మన ప్రభుత్వ విద్యారంగానికో అద్భుత అవకాశం కావాలి. విషాదమేమిటంటే ఇదే వాటి పాలిట శాపమై కూర్చొంది. ఇప్పుడు ప్రజల పేదరికమే మన సర్కారు స్కూళ్లకు శ్రీరామరక్ష!

### బీహార్‌కన్నా ఘోరం మన బడులు!

గత 12 ఏళ్లలో రాజీవ్ విద్యామిషన్ 19 వేల కోట్ల రూపాయలు ఖర్చు చేసింది. దూరదృష్టితో ఖర్చు చేసి వుంటే కేరళ స్థాయికి కాకున్నా తమిళనాడు స్థాయికి మన ఎలిమెంటరీ స్కూళ్లు ఖచ్చితంగా వచ్చి వుండేవి. కనీసం నితీష్ కుమార్ వచ్చాక బీహార్ బడుల్ని ఎలా తీర్చిదిద్దుతున్నారో చూచినా మనసుంటే మార్గం లేకపోలేదని తెలిసొచ్చేది.



దీనిపై ఎన్ని నివేదికలిచ్చినా, శాసన మండలిలో ఎంత మొత్తుకున్నా ఎన్ని సార్లు మంత్రులతో మొరపెట్టుకున్నా, సాక్షాత్తూ ముఖ్యమంత్రికి విన్నవించినా జరిగింది శూన్యం. ఇదంతా నా స్వానుభవం.

ఒక్కో డిఇఓ నియామకానికి ఆ జిల్లాలో ఎన్ని ప్రైవేటు స్కూళ్లు వున్నాయో లెక్కగట్టి తూకం వేసి రేటు నిర్ణయిస్తుంటే ఈ డిఇఓలకు సర్కారు స్కూళ్లు బాగుపడాలని ఎందుకుంటుంది? మంత్రుల్ని మహరాజుల్ని చెయ్యడానికి తప్ప మంచి గురువులుగా తీర్చిదిద్దడానికి పనికొచ్చే ఒక్క ప్రైవేటు బియిడి, డియిడి కాలేజీని చూడండి. వీటి నుంచి వచ్చే టీచర్ల నుంచి ఏదో విప్లవం రావాలని ఆశించడం ఎంత వెర్రితనం! ఇలా కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుంది.

### బడుల గూర్చి ఆలోచించరేమి?

దురదృష్టం ఏమిటంటే మన గ్రామాలు సైతం బడిని గురించి పట్టించుకోవడం మానేశాయి. లక్షలు లక్షలు పోగుచేసి పాలరాతి గుడులు కట్టించుకొంటాం కానీ బడిని మాత్రం పేడ దిబ్బలమయం చేస్తాం. పరుగెత్తి పరుగెత్తి ప్రైవేటు స్కూళ్లకి పిల్లల్ని పంపుతాం కానీ, మన ఊరి బడిలో మాత్రం గొర్రెలూ, బర్రెలూ తోలుతాం. 'మా ఊరికి మంచి బడి కావాలి' అనే డిమాండు ప్రజల్నించి దూసుకొస్తే పాలకులు కాళ్లబేరాలకు రారూ? బడి మన రాజకీయ అజెండాలోకి రాదూ? అప్పుడు టీచర్లు మాత్రం బడిని ఒక్కరోజైనా వదలగలరా?

ఈ నాలుగు ముక్కలే యుటిఎఫ్ మహాసభల్లోనూ చెప్పాను. ఎక్కడో ఒక చోట ఎవరమో ఒకరం ప్రారంభిద్దామని ప్రాధేయపడ్డాను. విద్య చుట్టూ ఒక సామాజికోద్యమం ప్రస్తుతం అవసరమని నా నిశ్చితాభిప్రాయం. దీనికి రాజకీయ నాయకులూ, పార్టీలూ ముందుంటాయనేది పచ్చి భ్రమ. మంచి టీచర్లు మొదలెడితే, సామాజిక ఉద్యమాలూ కార్యకర్తలూ తోడైతే బడిని ముచ్చటగా నడిపి జనానికో విశ్వాసం కల్గించి వారినీ కలుపుకోగల్గితే ఇది అసాధ్యమేమీ కాబోదు. ఒంటరిగా టీచర్లకు శక్తిగానీ, యూనియన్లకి ఆసక్తిగానీ వుందనే భ్రమ నాకు లేదు.

**- విఠపు బాలసుబ్రహ్మణ్యం**

*శాసన మండలి సభ్యుడు.*

# ఎమ్మెల్యేలు కాకముందే అయిన ఫీలింగ్‌లో వైకాపా నేతలు!

## పురిటిలోనే సంధి తగిలిందనే సామెతలా పార్టీ జిల్లా కన్వీనర్ బాధ్యతల స్వీకార కార్యక్రమం



నెల్లూరు జిల్లా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ వ్యవహారాలు చూస్తుంటే పురిటిలోనే సంధి తగిలిందనే సామెత గుర్తుకు వస్తున్నది. ఆదిలోనే హంస పాదులు వరసబెట్టి పడుతూనే వున్నాయి. ఇప్పుడు కొత్త తప్పటడుగు ఆ పార్టీ కొత్త జిల్లా అధ్యక్షుడు మేరిగ మురళీధర్ బాధ్యతల స్వీకారం రసాభాస కావడం.

పార్టీ పెట్టినప్పటి నుంచి మాజీ జిల్లా పరిషత్ అధ్యక్షుడు కాకాణి గోవర్ధన్‌రెడ్డి జిల్లా పెత్తనం చేస్తుండినాడు. ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డికి, ఆయనకు మనస్పర్థలు వచ్చాయి. అప్పటి నుంచి ఇద్దరి మధ్య కోల్డ్‌వార్ నడుస్తున్నది. నెల్లూరు రూరల్, నెల్లూరు టౌన్, ఆత్మకూరు, సూళ్లూరుపేట, గూడూరు నియోజకవర్గాల ఇన్‌ఛార్జిల నియామకంలో మేకపాటి మాట చెల్లుబాటు కాలేదు. ఆయన అలుక పాన్పు ఎక్కి వుండి నాడు. అక్కడ నుంచి దించడానికి ఓదార్పు మంత్రంగా జిల్లా అధ్యక్షుడి మార్పు చేశారు. గోవర్ధన్‌రెడ్డిని తప్పించి, మేరిగ మురళీధర్‌ను నియమించారు. మురళీధర్ రాపూరు వాస్తవ్యుడు. మేకపాటి సమీప బంధువైన పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి అనుచరుడు. దళితుడు. తన మాట ఎవరైతే తుచ తప్పకుండా వింటారో బాగా ఆలోచించి మురళీధర్‌ను ఎంపిక చేసుకొన్నాడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి. జిల్లా పార్టీ నిర్వహించాలంటే నెల్లూరు టౌన్‌లో వుండాలి. ప్రతిపక్షం కాబట్టి ఎప్పుడూ ఏదో ఒక ఆందోళన, ధర్నా, రచ్చ వుంటూనే వుంటాయి. వాటిని విజయవంతం చేయాలంటే స్థానికంగా పలుకుబడి, అనుచర వర్గం అవసరం. అందువల్లనే ఏ పార్టీ అయినా జిల్లా అధ్యక్షులను టౌన్ వాసుల నుంచే తీసుకొంటూ వుంటారు. కానీ టౌన్ వాసులైతే తమ ప్రత్యర్థి వర్గంతో సంబంధాలు కల్గి వుంటారని ఆలోచించి, రాపూరు నుంచి దిగుమతి చేశారు మేకపాటి.

ఆయన బాధ్యతల స్వీకారం మొన్న 1వ తేదీ జరగాలి. ఇప్పటివరకు జగన్ పార్టీ జిల్లా ఆఫీస్ కలెక్టర్ బంగ్లా దగ్గర ఒక అపార్ట్‌మెంట్‌లో నడుస్తూ వుండింది. పేరుకే జిల్లా ఆఫీస్ తప్ప అక్కడకు వెళ్లేవారు, కార్యక్రమాలు చేసే వారు లేరు. అది గోవర్ధన్‌రెడ్డి స్వంతంగా ఏర్పాటు చేసుకొన్న కార్యాలయం అట. తనకు జిల్లా అధ్యక్ష పదవి పోయింది కాబట్టి, పార్టీ ఆఫీస్ కూడా మూసేశాడాయన. బాడుగ భవంతి కాబట్టి అసలు యజమానులకు అప్ప చెప్పేశాడు. ఆ ప్రక్రియ సరిగ్గా మురళీధర్ బాధ్యతల స్వీకారం రోజే జరగడం విశేషమనుకొంటే విశేషమే. మొదట అనుకొన్న ప్రకారం ఈ బాధ్యతల స్వీకారం మేకపాటి గెస్ట్‌హౌస్‌లో జరగాలి. ఆ మేరకు పత్రికల వారిని కూడా అక్కడకే పిలిచారు. కానీ చివరి నిమిషంలో మనసు మార్చుకొన్న మురళీధర్ నేరుగా పాత ఆఫీస్ భవంతి వద్దకు వెళ్లాడు. అక్కడ ఆయనకు మూసిన తలుపులు స్వాగతం చెప్పాయి. విధిలేక కార్ పార్కింగ్ స్థలంలో నిలబడి బాధ్యతల స్వీకారం తంతు ముగించాడు. ఆయనకు చెరొక పక్క కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, ఆనం వెంకట రమణారెడ్డి నిలబడి మంత్రాలు చదవడం కూడా విశేషమనుకొంటే విశేషమే మరి. ఉప్పు నిప్పు కలిసి సహజీవనం చేస్తే ఆశ్చర్యం కల్గదా మరి?

జిల్లా పార్టీ అధ్యక్షుడి బాధ్యతల స్వీకారం ఇంత దీనంగా జరిపించుకోవలసి రావడం జగన్ పార్టీకి ఎంత మాత్రం శుభశకునం కాదు. పైగా ఆ కార్యక్రమానికి కాకాణి, నెలవల, కొమ్మి, రామిరెడ్డి తదితర ముఖ్య నాయకగణం మొత్తం గైర్హాజరైంది. ఒక్క మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి మాత్రమే వచ్చాడు. జిల్లాలో జగన్ పార్టీ దురవస్థ ఏమిటో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. ఎన్నికలు జరగక ముందే, గెలవక ముందే, అధికారంలోకి రాక ముందే ఇన్ని పాట్లు పడుతున్నారు ఆ పార్టీ నాయకులు. నిజంగా వీరందరూ ఎన్నికలలో గెలిచి, ఎమ్మెల్యేలైతే ఆ పార్టీ నిర్వహణ ఇంకెంత సుందర ముదనష్టంగా వుంటుందో వూహించుకోవచ్చు.





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com